

జననం తే. 2-8-1924; బి. ఏ. దాకా చదువు

కుటుంబ నియంత్రణలో శిక్షణ; వక్త, గ్రంధకర్త,
స్వచ్ఛంద సమాజ సేవకురాలు

| | |
|---|---|
| మల్లాది సుబ్బమ్మ ట్రస్టు | వ్యవస్థాపకురాలు |
| మహిళాభ్యుదయ సంస్థ | అధ్యక్షురాలు |
| ప్రజాస్వామ్య ప్రచురణలు | మేనేజింగు డైరెక్టరు |
| వైవాహిక, కుటుంబ సలహాసంఘం | కార్యదర్శి |
| మహిళాభ్యుదయ గ్రంధాలయం | ప్రెసిడెంటు |

ఆం. ప్ర. అభ్యుదయ వివాహవేదిక డైరెక్టరు

ఆం. ప్ర. హేతువాద సంఘం ఉపాధ్యక్షురాలు

అ. భా. రాడికల్ హ్యూమనిస్టు సంఘ జాతీయ సమితి సభ్యురాలు

భారత హేతువాద సంఘ కార్యనిర్వాహక సమితి-సభ్యురాలు

# "ఈ దేశం నాదేనా?"



## మల్లాది సుబ్బమ్మ




ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహదీపట్నం,
హైదరాబాద్ - 500 028

ప్రజాస్వామ్య ప్రచురణలు నెం. 28

# "ఈ దేశం నాదేనా?"

రచన: **మల్లాది సుబ్బమ్మ**

ప్రథమ ముద్రణ 1984

ప్రతులు 1000





పబ్లిషర్సు:-

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్

హైదరాబాద్-500 028

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:-

**వికాసం**

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,

**మెహదీపట్నం, హైదరాబాద్.**

పిన్: 500 028 ఫోను 31423

**వెల రు. 5-00**

ముద్రణ:

**లిబర్టి ప్రింటర్స్**

చీరాల-523 155

# "ఈ దేశం నాదేనా?"

హైదరాబాద్ నగరంలో గాంధి మెడికల్ కాలేజీకి ఎదురుగా రోడ్డుమధ్యలో పద్దెనిమిదేండ్ల యువకుడు పడి ఉన్నాడు. అతని చుట్టూ పెద్ద రక్తపుమడుగు. తల బ్రద్దలయింది, దృశ్యం భీభత్సంగా ఉంది. కాళ్ళు చేతులు నలిగి జజ్జు అయిపోయాయి. ఛాతీమీద రెండు పెద్ద గాయాలు కన్పడుతున్నాయి. చుట్టూ ఒక పందమంది జనంచేరి వలయాకారంలో నిల్చున్నారు. ఆందోళన పడుతుంది అచ్చటి ప్రజానీకం. వెనుకవరుసలో ఉన్నవారు అసలువిషయం ఏమిటో అని చూడాలనే కుతూహలంతో గెంతుతున్నారు. ఆ రోడ్డున పోతున్న కృష్ణారెడ్డి గుంపును చూచాడు. సహజమైన కుతూహలంతో జనాన్ని తోసుకొని ముందువరుసలోకి పోయ్యాడు. యువకుని చూచాడు. దిగ్భ్రాంతి చెందాడు. దగ్గరకుపోయి చేయి కాలు కదిలించాడు. చైతన్యంలేదు. ముక్కుమీద వేలుపెట్టి

చూచాడు. శ్వాస ఆడటంలేదు. కళ్ళు తేలవేసి ఉన్నాయి. ఆ యువకుడు అప్పటికే విగతజీవి.

చుట్టూ ఉన్నవారిని "ఈ దుర్ఘటన ఎలా జరిగిందో తెలుసా?" అని అడిగాడు. ఒకడు ముందుకు వచ్చాడు. "ఊరేగింపు ఒకటి ఇతనిమీదుగా దాటిపోయింది. ఊరేగింపును మొదటినుంచీ నేను అనుసరించాను." అన్నాడో పెద్దమనిషి.

అది 1965 వ సంవత్సరం. భారతదేశానికి స్వరాజ్యం వచ్చి పదునెనిమిదేండ్లు అయింది. భారతదేశం పాకిస్తానులు యుద్ధంలో ఇరుక్కున్నాయి. ఇరుదేశాల ప్రభుత్వాలు దురాక్రమణదారులని ఒకరి నొకరు నిందించుకుంటున్నాయి. భారతదేశ సేవలు లాహోరు సివార్లలో విడిసి ఉన్నాయి. ఆ నగరంలోకి వారు ఎప్పుడైనా ప్రవేశించవచ్చు; కాని ఎందుకో నగరానికి పదిమైళ్ళ దూరంలోనే ఉన్నాయి.

దేశభక్తి వెల్లివిరిసింది భారతదేశంలో. దేశాన్ని అమెరికా పాకిస్తానుల కుట్రనుండి రక్షించుకోవాలని నినాదం తలయెత్తింది. దేశంలోని ముసల్మానులను అనుమానంతో చూడసాగారు హిందువులు. కొంతమంది ముసల్మానులు పాకిస్తాను విజయాలకు హర్షిస్తున్నారు. మరికొంతమంది మనస్సులలో పాకిస్తాను గెలవాలనే తాపత్రయం ఉంది.

ఎక్కువమందికి ఈ తగాదా రావడం చాల ఇబ్బంది కరంగా ఉంది ఉరుము ఉరిమి మంగలంమీద పడ్డట్లు ఎప్పుడు ఏ ఉపద్రవం తమమీద విరుచుకు పడుతుందోనని తల్లడిల్లుతూ వున్నారు. కొంతమంది ముసల్మానులు సైన్యంలో విక్రమ పరాక్రమాలను ప్రదర్శించి ప్రజల మన్ననసూ ప్రభుత్వం మెప్పునూ పొందారు. వారికి బిరుదులూ బహుమతులు లభించాయి.

హైదరాబాద్ నగరంలో ఒక పెద్ద ఊరేగింపు కోఠిలో గాంధిగ్యాన్ మందిర్ వద్దనున్న పార్కునుండి బయలుదేరి ఆబిడ్సుగుండా నాంపల్లి మీదుగా మళ్ళీ బషీర్‌బాగ్ చేరుకుంది. ఊరేగింపులో పాల్గొనేవారిలో నూటికి ఎనభైమంది చక్కని మస్తులు ధరించారు. బాగా పోషణ ఉన్నవారేమో వారి బుగ్గలు ఊరిఉన్నాయి. ముఖాలలో ఆరోగ్యలక్షణాలు తొణికిసలాడుతున్నాయి. ఊరేగింపు అగ్రభాగాన మోటారు సైకిళ్ళపై, స్కూటర్లపై ఒక వందమంది సూటూ బూటూ వేసుకున్న యువకులు ఉన్నారు. వారి వెనుక బ్యానర్లు పట్టుకొని కాలేజీ విద్యార్థినులు బారులుతీరి రెండు వరుసలుగా నడుస్తున్నారు. ఊరేగింపులో ఉన్నవారంతా కలవారి బిడ్డలని తోస్తుంది చూపులకు. 'పాకిస్తానును ఓడించండి', 'దేశాన్ని రక్షించుకోండి', 'విదేశీ కుట్రను భగ్నం చేయండి', 'దేశంలోని ద్రోహులను పసిగట్టండి' లాంటి బ్యానర్లు

ఊరేగింపులో ఉన్నాయి. చూస్తే ఇంచుమించుగా అంతా హిందువులే కన్పడుతున్నారు. అక్కడక్కడ చెదురు మదురుగా మచ్చుకో ముసల్మాను ఊరేగింపులో ఉన్నట్లు అనిపిస్తుంది. నినాదాలు మిన్నుముట్టుతున్నాయి. ఇంతలో లిబర్టీ వైపునుండి పద్దెనిమిదేండ్ల కుర్రవాడు ఊరేగింపుకు ఎదురుగా పరుగెడుతున్నాడు అతని జుట్టు రేగివుంది. ఇటీవల రెండు నెలలుగా అతని తల తైలసంస్కారానికి నోచుకో నట్టుంది. ముఖం మట్టికొట్టుకొని వుంది. చొక్కా చేయి ఒకటి లేదు. ఛాతీమీద చొక్కా చినుగులు పైనుంచి క్రిందకు రెండో మూడో కనపడుతున్నాయి. తొడుక్కున్న లాగూ పాంటూ కాదు; నిక్కరూ కాదు. పిక్కల మధ్యవరకు అది అతని దేహాన్ని ఆవరించింది. లాగురంగు వెలవెల పోతుంది. అతనేదో కేకలు వేసుకుంటూ వస్తున్నట్లుంది.

అతడు ఊరేగింపు అగ్రభాగాన ఉన్న మోటారు పైకెళ్ళను పదిగజాల దూరంలోకి వచ్చాడు. అతని కేక స్పష్టంగా వినిపిస్తోంది ఊరేగింపులోనివారికి. అది ఒకటే రోకటి పాటలా. "ఈ దేశం నాదేనా?" అతనిది పిచ్చి వాలకంగా ఉంది. మనిషి ఊగిపోతున్నాడు. పళ్ళు పట పట కొరుకుతున్నాడని తెలుసుకోవచ్చు. ఏదో మైకంలో ఉన్నాడని అనుమానిస్తున్నారు. త్రాగుబోతేమోననే సందేహం వచ్చింది ఊరేగింపులో కొందరికి.

"ఎస్! తప్పుకో" అని అరిచారు మోటారుసైకిళ్ళ మీద ముందు తీవీగా పోతున్న యువకులు. అతడు ఆ మాటలు విన్నట్లు దాఖలా ఏమీ కనుపించటంలేదు. అదేకేక "ఈ దేశం నాదేనా?" మళ్ళీ అదేకేక "ఈ దేశం నాదేనా?"

దేశభ-క్తితో పరవశమయ్యే యువకులు ఇదేదో సవాలుగా భావించారు. వారి యువక రక్తము ఉడికిపోయింది. అతనిని దేశద్రోహిగా తీర్మానించుకున్నారు. వెంటనే ముందున్న మూడు వరుసల వారూ "దేశద్రోహులు నశించాలి" అనే నినాదాన్ని ఇచ్చారు. ఊరేగింపులోని విద్యార్థినులు అందుకున్నారు. తమ కీచుగొంతులతో ఒక్క-సారిగా "నశించాలి" అని వంత పలికారు. తతిమ్మావారు ఎలుగెత్తి అరిచారు. కాని ఊరేగింపు చివరలో ఉన్నవారికి ఈ నినాదం ఒక్క-టే ఇలా ఎందుకు ఇవ్వాల్సి వచ్చిందో అవగతం కాలేదు. ఏదో దేశద్రోహుల ముఠా ఊరేగింపుకు ఎదురువచ్చి ఉంటుందని ఊహాగానం చేశారు.

ఈ నినాదాలకు ఎదురు వస్తున్న మనిషి జడియలేదు. కంఠస్వరం హెచ్చించాడు. "ఈ దేశం నాదేనా?" అని రెండింతలు బిగ్గరగా అరిచాడు. ముందున్న మోటారుసైకిలు బృందం దీన్ని అవమానంగా తీసుకున్నారు. హారన్లు మోగించారు మొదటి వరుసవారు. తతిమ్మావారు అలాగే శబ్దం

చేశారు. సైకిళ్ళు ముందుకు సాగినయి. ఊరేగింపు కదిలింది.

"పదండి ముందుకు
పదండి ముందుకు
పాకిస్తానన గ నెంతరా ?
దాని తాహతెంతరా ?
అంత కలసి తంతే
అంతు లేక పోవురా!"

అనే పదాన్ని 1942 లో జపానుపై వ్రాసిన గేయాన్ని పాకిస్తానుకు అన్వయించి పాటలంకించుకున్నాడు ఒక విద్యార్థి.

ఎదురుగా వచ్చిన వ్యక్తి "ఈ దేశం నాదేనా?" అని అరుస్తూనే ఉన్నాడు.

ఇంతలో అతని కేకలు విన్పడటంలేదు. ఊరేగింపులో వారి పాటమాత్రం లయబద్ధంగా అందరినీ ఆకర్షిస్తున్నది.

అతడు పడిపోయాడు. ఒకటి రెండు మోటారు సైకిళ్ళు ఆతని మీదుగా పోయాయి. ఊరేగింపులో కదం కలిపే యువతీ యువకుల పాదాలు అతని మీదుగా నడచి వెళ్ళాయి. ఊరేగింపు అతనిని దాటి వెళ్ళింది.

కృష్ణారెడ్డి ప్రక్కనున్న అతని స్నేహితుడు నారాయణరావు ఆ వ్యక్తిని చూచాడు. దగ్గరకు వెళ్ళాడు.

" ఇతడు నీకు తెలుసా? " కృష్ణారెడ్డిని అడిగాడు.

" తెలుసు "

" అతనిది ఏ ఊరు? "

" తెలుగుదేశం "

" దేశ ద్రిమ్మరా? "

"ఒక రకంగా అలా భావించటానికి అవకాశం ఉంది"

" నీవు అతన్ని ఎక్కడ చూచావు? "

" ఈ ఊళ్ళో చూస్తున్నా? "

కృష్ణారెడ్డి ముఖం విన్నబోయింది. ఎవరో ఆత్మీయుడిని పోగొట్టుకున్న వాడిలా కంటతడి పెట్టుకున్నాడు. రెడ్డికీ ఆ వ్యక్తికీ ఉన్న సంబంధం ఏమిటో నారాయణరావుకు బోధపడటం లేదు.

" అతని కథ నీకు తెలుసా " ప్రశ్నించాడు నారాయణరావు. ఔనన్నట్లు తల ఊపాడు కృష్ణారెడ్డి.

ఆ వ్యక్తి శవదహన సంస్కారభారం తను చేపట్టాల్సి ఉంటుందని రెడ్డి సూచించాడు.

అతని విషయం అమూలాగ్రంగా చెపితే తనూ సహకరిస్తానని హామీ ఇచ్చాడు నారాయణరావు.

తన స్నేహితుడికి ఈ కథ చెప్తూ అబిడ్సువైపు సాగిపోయాడు కృష్ణారెడ్డి.

# 2

కృష్ణారెడ్డి పేరుపొందిన నవలారచయిత. అతడి నవలలు ప్రచురించిన రెండుమూడు నెలలకే ప్రతులన్నీ అమ్ముడుపోతాయి. సునిశితంగా మనస్తత్వ పరిశీలన చేయగల సత్తా అతనికి ఉందని విమర్శకుల అభిప్రాయం. పండితులూ, పామరులూ ఇరుతెగలవారూ అతని రచనలను ఆదరిస్తూ వున్నారు. దాంతో కొంత ఆర్థికస్తోమతు ఏర్పడింది అతనికి.

నారాయణరావు కృష్ణారెడ్డికి బాల్యస్నేహితుడు. జీవితం దొర్లించటానికి ఏదో ప్రభుత్వ కార్పొరేషనులో ఉద్యోగం చేస్తున్నాడు. కాని అతని అభిమానవిషయం గ్రంథపఠనం, సారస్వతవిమర్శ. కృష్ణారెడ్డి వ్రాసిన ప్రతి నవల అచ్చుకు పోబోయేముందు నారాయణరావుకు విధిగా విన్పిస్తాడు. అతని నిష్కామగమాటపు విమర్శవల్ల ఎక్కువగా లాభిస్తూ వున్నాడు కృష్ణారెడ్డి. ఇలా వీరిరువురిమధ్య సన్నిహితత్వం దినదిన ప్రవర్ధమాన మవుతూఉంది.

ఇరువురు కలసి సాయంకాలపువేళ నగరంలో తిరిగిరావటం వారికి సరదా. అలా తిరుగుతున్న సందర్భంలోనే కృష్ణారెడ్డి ముమ్మందుగా ఆ గాయపడి మరణించిన యువకుని చూడటం సంభవించింది.

కృష్ణారెడ్డి కథ చెప్తున్నాడు. కాని అది ఆ యువకుని కథకాదు. ఆ యువకుడి కథ తనకు మొదట్లో ఎలా తెలిసిందో చెప్పేగాథ.

"ఒకరోజు ఉదయం నేను తీరికగా డ్రాయింగురూంలో కూర్చున్నాను. రాములమ్మ వచ్చింది. కథలురాసే కృష్ణారెడ్డిగారి ఇల్లిదేనా అని అడిగింది"

"రాములమ్మ ఎవరు? ఆమెకూ ఈ యువకునికీ ఏమిసంబంధం?" ఆత్రుతగా అడిగాడు నారాయణరావు.

"అదేచెప్తున్నా. విను. నేనే కృష్ణారెడ్డిని అని ఆమెకుచెప్పాను. ఆమె నాకు నమస్కారంచేసి నిలుచున్నది. కూర్చోమన్నాను. కాని ఆమె సోఫాలో కూర్చోలేదు నిలుచొనిఉండే తను వచ్చినపని చెప్పింది."

నారాయణరావుకు ఉత్కంఠ ఎక్కువయింది.

"ఏం చెప్పింది?" నారాయణరావు ప్రశ్నించాడు.

"మామూలుగా ఓపికగా వినే నీకు ఇంతతొందర వచ్చిందే ఏమయిందిసీకో" అంటూ స్నేహితుడివి ఎగాదిగా చూచాడు కృష్ణారెడ్డి.

"సరే మధ్యలో మాట్లాడనులే. విషయం వివరించు" అన్నాడు నారాయణరావు.



"ఈ దేశం నాదేనా?"

కృష్ణారెడ్డి అంతర్ముఖుడై మాట్లాడటం సాగించాడు. ఏవో జ్ఞాపకం చేసుకొని మరీ పలుకుతున్నట్లు కనిపిస్తున్నది.

"నాపేరు రాములమ్మ. మా బస్తీలో నాకో తమ్ముడు ఉన్నాడు. వాడిపేరు వెంకన్న. వాడంటే మా కందరికీ ప్రాణం. వాడు మామనిషి. మాకోసం బతుకుతున్నాడు. వాడిని చావగొట్టించారు డబ్బుగలవోళ్ళు. వాడికిప్పుడు మతిపోయింది." రాములమ్మ గబ గబ మాట్లాడేసింది.

ఏదైనా సానుభూతి సంపాదించి అతని వైద్యానికి పదో పరకో చందా తీసుకొని పెళ్దామని వచ్చిందని భావించాను. జేబులోంచి అయిదురూపాయలు తీసి ఆమెకు ఇవ్వబోయాను.

"అయ్యగోరూ! నేను పైసలకోసం రాలేదండి. నాకు నా తమ్ముడిని గురించే ఆలోచనండీ" అన్నది రాములమ్మ. తన తమ్ముడిని ఏదైనా పెద్ద డాక్టరుకు సిఫారసు చేసి వైద్యం చేయించమంటున్నదేమోనని తలపోశాను. అమాటే అన్నాను.

"కాదండీ బాబుగారూ! నేను అందుకు రాలేదు. మీవల్ల సహాయం కావాల్సి వచ్చాను" స్పష్టంగా చెప్పింది రాములమ్మ.

నేను తికమక పడ్డాను. నేను చేయగలసహాయం ఏమైఉంటుందా అని ఆలోచించసాగాను.

"మీరు కథలురాస్తారని మా బస్తీలో చదువుకున్న వాళ్ళు చెప్పుకుంటుంటారు. మా వెంకన్నకూడ మిమ్మల్ని గురించి మాగొప్పగా చెప్పేవాడు. వాడికథనేను మీకు పూర్తిగా చెపుతాను. వాడికథ మీరు రాస్తే వాడికి మతి పోయినా వాడు బతికుంటాడు. ఈమాత్రం సాయం చెయ్యండయ్యా" ప్రాధేయపూర్వకంగా అడుగుతూ నాపాదాలకు నమస్కరించింద.

నేను విస్తుబడనయ్యాను. ఆమెను రెమ్మనిచెప్పి తప్పకుండా రాస్తానని మాటఇచ్చాను. కాని నాకు ఒక సందేహం కల్గింది. అతని కథ ఈ మనిషి సరిగా చెప్పగలదా నా అనుమానం. ఆ అభిప్రాయం వెలిబుచ్చాను.

"ఎంతమాటన్నారు అయ్యగోరూ! నా తమ్ముడు వెంకన్నకు నా వద్ద దాపరికాలు లేవండి అన్నీ నాతో చెప్పుకునేవాడు. చివరకు రోజాసంగతికూడా వాడు తనే తెలియజేశాడు." రాములమ్మ సగర్వంగా పలికింది. రోజా ఎవరో చెప్పమన్నాను.

"అయ్యో! నా తెలివిమండ. మధ్యలో మొదలెట్టాను వాడికథ. రోజాఅండీ వాడిచగ్గరమనిషండి. వాడికి ఆ అమ్మాయి అంటే! మాచెడ్డ ప్రేమఅండీ" అని తన తమ్ముడి ప్రియురాలి సంగతి ఎరుకపరచిందినాకు. అలాగా అని తల ఊపాను.

"నా తమ్ముడండీ రత్నం అండీ. వాడికి దీటువచ్చే వాళ్ళు మా బస్తీలో ఎవరూ లేరండీ. వాడు తన కథ అంతా నాకు దాపరికం లేకుండా చెప్పేడండీ నాకు" అని ధీమాగా పలికింది రాములమ్మ.

తీరికగా కూర్చొని వెంకన్న కథ మొత్తం వరుసగా ఉన్నప్పటినుంచి నాకు చెప్పమని రాములమ్మను కోరాను. ఆమె నా కోరికను మన్నించింది. అప్పటినుంచే వెంకన్న అంటే నాకు వల్లమాలిన అభిమానం గౌరవం కల్గాయి. అతనిని చూడాలని నాకు అభిలాష కలిగింది. ప్రత్యేకంగా వెళ్ళి అతనిని చూచి వచ్చాను.

"మరి ఈ విషయం మన సంభాషణలో ప్రస్తావనకు రాలేదే?" విస్తుపోతూ ప్రశ్నించాడు ఇంతసేపూ ఓపికగా విన్న నారాయణరావు.

"నవలరాసి, ఒక్కసారి నీకు చదివి వినిపించి నిన్ను ఆశ్చర్యంలో ముంచేద్దామని ఆలోచించాను" అన్నాడు కృష్ణారెడ్డి.

"సరే. ఇక అసలు కథకురా" ప్రోత్సహించాడు నారాయణరావు.

వెంకన్నకథ సవిస్తారంగా నారాయణరావుకు చెప్పుకుంటూ పోయాడు కృష్ణారెడ్డి.

# 3

ఎనభై ఏండ్లవాడు ముసలాడు ఆ బస్తీలో ఇరుకు సందులో పడిఉన్నాడు. అతడి ప్రక్కన పదేళ్ళకుర్రడు "తాతా! తాతా!" అంటూ ఏకధారగా కన్నీరు కారుస్తూ ఏడుస్తున్నాడు. ఒకరిద్దరు చిన్నపిల్లలు ఏదో చోద్యం చూస్తున్నట్లు చుట్టూ నించున్నారు.

ఆ బస్తీ జంటనగరాలలో మురికివాడ క్రిందలెక్క. దానికి కుడివైపున నాలుగుఅంతస్థులమేడ, ఎడమవైపున మరో మూడు అంతస్తులమేడ ఉన్నాయి. బస్తీలో డెబ్బయి, ఎనభయి గుడిసెలు ఉంటాయి. అవీ ఒక వరుస వాయిలో ఉన్నట్లు కన్పడదు. రోడ్డుమీద ఉన్న ఎలెక్ట్రిక్‌దీపం తప్ప ఆ బస్తీవారికి వీధిదీపాలు లేవు. ఆ మాటకువస్తే బస్తీమధ్య రోడ్లులేవు. వంకరటింకర త్రోవలుమాత్రం ఉన్నాయి. అలాంటిదాన్నే సందు అంటారువాళ్ళు. అక్కడ కాపురము ఉండేవాళ్ళంతా నెలకు వందరూపాయలలోపు వరుమానం ఉన్నవాళ్ళు. కొంతమందికి అసలు సంపాదనేఉండదు. వానమీద ఆధారపడే మెట్ట పైరులాగా కొంతమంది సంపాదన ఆరోజువేళా విశేషంమీద ఆధారపడుతుంది. అది ఒక నానాజాతి సమితి. నిరుద్యోగులు, ఉద్యోగులు, శ్రామికులు సోమరిపోతులు, కాయకష్టం చేసేవారు పరాన్నభుక్కులూ,

ఆటోరిక్షాడ్రైవర్లూ, లారీడ్రైవర్లూ, ఓ! ఒకరేమిటి అన్ని వృత్తులవాళ్లూ, ఏ వృత్తిలేనివాళ్ళూ అందరూ అక్కడ సహజీవనం చేస్తున్నారు. అంతా కృష్ణ అవతలివాళ్ళే. పొట్టచేతబట్టుకొని నగరం వచ్చినవాళ్ళే.

గుడిసెలలోవారు ఎక్కువమంది ఉదయం ఎనిమిది న్నరకు బయటికి వెళతారు. రాత్రి ఏడుగంటలకు ఇంటికి వస్తారు. ఆడామగ ఎక్కువగా పనికి పోతారు. మరి ముసలిముతకా చిన్నపిల్లలూమాత్రమే పగలు కన్పడుతూ వుంటారు.

తాతప్రక్కన ఆ కుర్రవాడు రోదిస్తున్నసమయం సాయంత్రం అయిదుగంటలకు. చుట్టుప్రక్కలమున్న గుడిసెల లోని ముసలాళ్ళు అక్కడికి చేరారు. "ఊరుకోనాయనా! మీ తాత వెళ్ళిపోయాడు మళ్ళీ తిరిగిరాడు. ఏడ్చి ఏంలాభం?" అని కొంతమంది ఆ కుర్రవాడిని ఓదారుస్తున్నారు.

వాడు "తాతా! నాకేదిగతి? నన్ను ఎవరుచూస్తారు?" అంటూ బిగ్గరగా ఏడుస్తున్నాడు.

ఏడుగంటలయింది. అబస్తీ జనంతో నిండిపోయింది. రోజు కూలికి వెళ్ళే మగవాళ్ళూ, ఆడవాళ్ళూ తిరిగివచ్చారు ఎక్కడో రెండుమైళ్ళ దూరానవుండే కాలనీలలో పనిపాటలు చేసే ఆడవాళ్ళు ఇళ్ళకు చేరారు.

శపిస్తూ ఆడామగా నుంచున్నారు. "ఈముసలాడు మా సిత్రకలవాడురా. ఎప్పుడూ ఎవరినీ ఏమీ అడిగిఎరగడు" అని చచ్చినవాడిని పొగుడుతున్నారు కొందరు.

"ఇక ఈ కుర్రవాడివిషయం ఎవరుచూసుకుంటారు?" అని కన్నీరు కారుస్తున్నారు కొందరు ఆడంగులు.

"తమాషా చూశార్రా! తానుదూరసందులేదు తన మెడకోడోలు అన్నట్లు ఈ ముసలాడికి ఈ కుర్రాడు ఓ బంధం" అన్నాడు ఒకడు వెళ్ళిపోతూ.

ఇంతలో కూలీలకు అన్నం అమ్మే రాజవ్వవచ్చి చూచింది ముసలాడిని.

"పీడిదుంపతెగా! ప్రొద్దున పదిగంటలకు నాదగ్గర అన్నం కూర కొని తిన్నాడు వీడు. ఇంతలో ఏమయిందర్రా?" ఆశ్చర్యం వెలిబుచ్చింది రాజవ్వ.

"గుండె ఆగి చచ్చిఉంటాడు. ఈ మధ్య గుండె జబ్బులు ఎక్కువయాయి" మాటవిసిరాడు టాక్సీడ్రైవరు పెంచలయ్య.

"గొప్పింటివాళ్ళకైతే ఆస్పత్రులూ వైద్యాలూ మనకేలాగు వస్తాయి అవి?" ప్రశ్నించింది బస్తీ పడుచు రాములమ్మ.



"ఈ దేశం నాదేనా!"

"ఛ ఛ! మురికిచావు చచ్చాడు ముసలాడు."
చీదరించుకున్నాడు రంగడు.

"లేరా వెంకన్నా! మా ఇంటికి పోదాంపద" తట్టి లేపాడు సోమయ్యకొడుకు కోటయ్య. బస్తీ పెద్దలు చేరారు. శవాన్ని ఈ రాత్రికే తియ్యాలన్నారు. మరి తగలెయ్యటానికి డబ్బులో! ముందు ముసలాడిజోలె చూడండన్నారు పెద్దలు. ఒకడువెళ్ళి ముసలాడి సంచిలో చెయ్యిపెట్టి చూచాడు. ఒక గుడ్డపేలికలో చిన్నమూట కనపడ్డది. విప్పితే రెండు పదిరూపాయలనోట్లు. మరోపేలికలో మరోచిన్నముడి. విప్పితే రెండురూపాయలపావలా చిల్లర దొరికింది. వీటిని పెద్దలయెదుట పెట్టాడు ఆ మనిషి.

"తస్సదియ్యా! ముసలాడు అసాధ్యుడే. పావుటన్ను కట్టెలకు పైకం వేరే దాచాడు. ఎంతనీతిగలోడురా వీడు" ఒక బస్తీపెద్ద చచ్చినవాడిని పొగిడాడు.

చిల్లరడబ్బులు తాతదగ్గర ఏడుస్తున్న కుర్రాడిజేబులో పడేశాడు ఒకపెద్ద. తాత దాచుకున్న 20 రూపాయలతో శవాన్ని ఎత్తి స్మశానానికి తరలించారు. పదిమందిదాకా ఆడామగా స్మశానానికివెళ్ళి తగలేసి వచ్చారు.

ఆ రాత్రికి సోమయ్యభార్య తాత కుర్రాడికి - వెంకన్నకు - బలవంతంమీద అన్నం తినిపించింది.

తాత ఆ బస్తీలో అయిదేండ్లనుంచీ కన్పడుతున్నాడు. అతను వచ్చినప్పటినుండీ వెంకన్న అతనివెంటనే ఉన్నాడు. తాతది ఏ ఊరో ఎవరికీ తెలియదు. "ఏ ఊరుతాతా నీది" అని అడిగితే "దచ్చాది" అనేవాడు. అంతకన్నా వాళ్ళను గురించి ఎవరికీ తెలియదు.

వెంకన్నను గురించి అడిగితే తనమనవడని చెప్పేవాడు.

రాజవ్వదగ్గర బువ్వ కొనుక్కొని తినేవాడు. తనకున్న దాంట్లో పెట్టేవాడు వెంకన్నకు.

నగరంలో కుండీలలో కాగితాలు, సీసాలు, సీనారేకు డబ్బాలు ఏరుకొనివచ్చి వాటిని షోకయ్యకొట్లో అమ్ముతూ ఉండేవాడు. ఒకరోజు రూపాయి వచ్చేది. మరోరోజు అర్ధరూపాయి గిట్టేది.

వెంకన్నకు ఆ రాత్రి నిదరపట్టలా. ఇన్నాళ్ళూ ప్రేమగా పెంచింది తాతే. ఇప్పుడు ఇక తాతలేడు. తనగతి ఏం కాను? ఓ గంట గోలీలాటడానికి తను వెళ్తే తాత తహ తహ లాడేవాడు. "వెంకన్నా! ఎక్కడకు వెళ్ళావురా? ఇంతసేపూ?" అంటూ గోలపెట్టేవాడు.

"తాతకు తను ఏమవుతాడు? తాత తనను ఎందుకు పెంచాడు?" తనకేమీ తెలియదు.

"తాతా! మా అమ్మా నాన్నా ఏరి?" అని తాతను అడిగితే "వాళ్ళూ నీకు కనపడని లోకానికి వెళ్ళారయ్యా" అనేవాడు తాత.

"ఈ దేశం నాదేనా?"

ఒకరోజు తనకు జ్వరంవచ్చి బువ్వ తినకపోతే అలమటించిపోయాడు తాత. ఆ రాత్రి తాతకూడా బువ్వ తినలా. ఇలాంటి తాత లేకుండా తను ఎలా బతకాలి? ఎలా బతకగలను అనుకుంటూఉంటే ఆలోచనల బరువును మోయలేని అతని మనస్సు పనిచేయనని మొరాయించింది. వెంకన్న నిదరలోకి జారాడు తెల్లవారుజామునుకు.

# 4

తెల్లారింది. అది తాత చచ్చిపోయిన మర్నాడు. వెంకన్న నిదరలేచేటప్పటికి ఏడుగంటలయింది. ప్రతీగుడిసె లోనూ ఆడంగులు వంటలూ వార్పులూ మొదలెట్టారు. ఏడ్చి ఏడ్చి నిదరోయాడని జాలితలచి నిదరలేపలేదు వెంకన్నని అంతకుముందు.

మెలకువ రాగానే వెంకన్నకు తాత జ్ఞాపకం వచ్చాడు.

"తాతా! నన్ను వదలిపెట్టి పోయావా!" ఎలుగెత్తి ఏడ్చాడు వెంకన్న.

సోమయ్యభార్య వాడిచేత బిలపంతాన గంజినీళ్ళు తాపించింది. తన కొడుకుతోపాటు బువ్వ పెట్టింది ఎనిమిది గంటలకు.

"ఒరే! నీవూ మీ తాతచేసినపనే చెయ్యరా" అని వెంకన్నను ప్రోత్సహించాడు సోమయ్య.

"వెంకన్నా! నేను పనిచేసే సైకిలుషాపు ఉందే వానిదగ్గర కాలనీలో పడుకోరా" అన్నాడు సోమయ్య కొడుకు కోటయ్య.

మెడలో జోలె వేసుకొని బుజంమీద రెండు చినిగిన గోతాలు పెట్టుకొని బయలుదేరాడు వెంకన్న.

పెద్ద పెద్ద బంగళాలు ఉన్న కాలనీకి చేరాడు. ఒక మూలనున్న కుండీలో వెతికాడు. పాతకాగితాలు, సీసాలు, కొన్ని పాతడబ్బాలు దొరికాయి. వీటినన్నింటిని తన దగ్గర నున్న గోతంలో వేశాడు. మరో వీధిమూలకు వెళ్ళాడు. కుండీలో చెత్తను బయటికి తీస్తున్నాడు. సూటూ బూటూ హేటుతో వెళ్తున్న యువకుడు వెంకన్నని చూచి ఆగాడు.

"ఒరేయి కుర్రాడా నీవు ఏరుకున్నతరువాత మళ్ళీ ఆ చెత్త అంతా కుండీలో వేసిపో" అని పురమాయించాడు.

వెంకన్న వచ్చేటప్పటికి కుండీలో చెత్తగాక కుండీ చుట్టూ ఒకగజంమేర చెత్త పడిఉన్నది. వెంకన్నకు కోపం వచ్చింది. చెత్తను కుండీలో వేసేటట్లు తన పనిమనిషిని పురమాయించలేని ఆ పెద్దమనిషి తనను దబాయిస్తున్నాడు. 'గొప్పవారికి చెల్లుతుంది ఏమన్నా' అనుకుంటూ వెంకన్న సాగిపోయాడు.

మరోవీధిమూలకు చేరాడు. అక్కడా ఒక కుండీ ఉన్నది. కాని ఆ కుండీలో చెత్తలేదు. అంతా బయటేఉంది.

ఏరుకుంటున్నాడు వెంకన్న. ప్రక్క బంగాళాలోనుంచీ ఒక బూరమీసాలాయన బైటికి వచ్చాడు చేతిలో బెత్తం ఝళిపించుకుంటూ.

"వెధవాయా! బెత్తంతా రోడ్డుమీద వెదజల్లావుట్రా" ఉగ్రుడై వెంకన్నమీదకి వచ్చాడు.

"నాను చిమ్మలేదండీ! నాను వచ్చేటప్పటికే కింద ఉందండీ" బెరుకు బెరుకుగా జవాబుచెప్పాడు వెంకన్న.

"తప్పుడుపని చేసిందికాక ఎదురుజవాబు చెప్తావురా వెధవకాన" బెత్తం ఎత్తాడు ఆ పెద్దమనిషి. పరుగులంకించు కొని పారిపోయాడు వెంకన్న.

రోడ్డుమలుపు తిరిగాడు వెంకన్న. పెద్దరోడ్డుప్రక్కన పేవుమెంటుమీద ఒక పెద్దగేటుకు ఎదురుగా నుంచున్నాడు. భౌ భౌ అని అరుస్తూ గేటుఅవతల ఇంటి ఆవరణలో పెద్దజాతి కుక్క. భయంవేసింది వెంకన్నకు. గేటువైపు చూచాడు. గడియ వేసివుంది.

'అమ్మయ్య' అనుకున్నాడు. కుక్కఅరుపులువిని గేటు కాపలా గూర్ఖా వచ్చాడు. లోపలనుంచే "జా! బేటా జా!" అని వెంకన్నను గదిమాడు.

వెంకన్న ఆలోచనలో పడ్డాడు. "రోడ్డు పెజల్దానిది కదా. రోడ్డుపక్క పేవుమెంటూ అరిదే. తను ఆబాటమీద

సుంటోరావా?'' వెంకన్న కదలకపోవటం గూర్ఖాకు కోపకారణ మయింది. జాతికుక్క మరీ ఎక్కువగా అరుస్తోంది.

"సున్‌తేనై! సువర్ కేబచ్చే" తిట్టున్నాడుగుర్ఖా. ఈ లోకంలోకివచ్చాడు వెంకన్న. అదిరిపడ్డాడు. ఇంతలో బంగళా తోటమాలి వచ్చాడు.

కుక్క అరవటం ఆపలా.

"దొంగవెధవలు. గేటు కాస్త తీసివుంటే లోపలికి వచ్చి దొంగతనాలు చేస్తారు" ఈసడింపుగా మాట్లాడాడు తోటమాలి.

వెంకన్న ముందుకు కదిలాడు.

ఎలాగయితేనేం రెండుగోతాల కాగితాలు పగ్గైరాలు పోగుచేశాడు. పోశయ్య కొట్టుదగ్గరకు వెళ్ళాడు సాయంత్రం అయిదుగంటలకు.

పోశయ్యను చూచేటప్పటికి వెంకన్న దుఃఖం కట్టలు తెంచుకున్నది.

"పోశయ్యా! మా తాత చచ్చిపోయిండయ్యా" బావురు మన్నాడు వెంకన్న.

"ఏమయిందిరా ఇంతలో! నిన్నమధ్యాన్నమే రెండు గోతాల సరుకు ఇచ్చిపోయాడుగదరా!" సముదాయించాడు పోశయ్య.

వెంకన్న బుజాలమీదనున్న రెండు గోతాలను చూశాడు పోశయ్య.

"ఏంరా! సరుకు తెచ్చినట్టుందే: అవునులే బతకాలిగా" సానుభూతి చూపించాడు పోశయ్య.

"అవునయ్యా! చూసుకో" క్రుమ్మరించాడు గోతాలను వెంకన్న.

అదంతా తీసుకొని పావలా చేతులో పెట్టాడు పోశయ్య.

"మా తాతకు రూపాయి ఇచ్చేవాడివిగా?" అడిగాడు వెంకన్న తనకళ్ళను తానే నమ్మలేక.

"మీ తాత తెచ్చేసరుకు వేరురా. నీవూ మంచిసరుకు తీసుకురా. నీకూ రూపాయి వస్తుంది" అనునయించి చెప్పాడు పోశయ్య.

ఇందులో ఏదో మోసముందని వెంకన్న అనుమాన పడ్డాడు. చేసేదేమీలేక బిక్కమొగం పట్టాడు.

దోవలో నాలుగుబజార్ల కూడలి దగ్గర ఒకమూల రాజవ్వ కనపడింది. ప్రాణంలేచివచ్చింది వెంకన్నకు. ఎప్పుడో ప్రొద్దున తిన్నాడేమో ఆకలిగాఉంది. కడుపు నకనక లాడుతూంది. రాజవ్వదగ్గరకు వెళ్ళాడు.

"అవ్వా బువ్వపెట్టవూ!" అడిగాడు వెంకన్న.

"డబ్బులున్నాయన్రా" ప్రశ్నార్థకంగా చూచింది రాజవ్వ.

"ఇదిగోపావలా అని ఆమెచేతికిచ్చాడు వెంకన్న. ఒక ఆకులో అన్నంపెట్టి పులుసుపోసింది రాజవ్వ. ఆవురు ఆవురు మంటూ తిన్నాడు. మంచినీళ్ళిచ్చింది రాజవ్వ. అయిదు పైసలు చేతిలోపెట్టింది.

వెంకన్న బస్తీ దారి పట్టాడు. వాడినిచూచి కళ్ళనీళ్ళు పెట్టుకుంది రాజవ్వ.

దోవలో కోటయ్య పనిచేసే సైకిలుషాపు కనపడింది. వాడున్నాడేమోనని షాపువేపు చూచాడు వెంకన్న. కోటయ్య ఒకసైకిలుకు గాలి కొట్టున్నాడు. వెళ్ళి అక్కడ నుంచున్నాడు వెంకన్న.

కోటయ్య ప్రొద్దున తొమ్మిదినుండి సాయంత్రం ఆరు గంటలదాకా బాషా సైకిలుషాపులో పనిచేస్తాడు. సైకిళ్ళకు గాలి కొట్టడం, రిపేరు చేస్తున్న బాషాకు రెంచీలూ, స్క్రూడ్రైవర్లూ, నట్లూ అందించడం అతగాడిపని. తొమ్మిది గంటలూ పనిచేస్తే రోజుకు పావలా ఇస్తాడుబాషా. ఏరోజు పనికిరాకపోతే ఆరోజు అదికూడాలేదు. బాషాకొట్టుతీయకపోతే ఆరోజు కోటయ్యకు పైసాకూడా రాదు. నాలుగు అయిదేండ్లు తిప్పలుపడితే సైకిలు రిపేరింగు చాతవుతుందని సోమయ్య కొడుకును షాపులోపెట్టాడు. కోటయ్యకు పదకొండేళ్ళు

వుంటాయి. చదువులేదు. చిన్నప్పటినుంచీ ఇలా ఏదోపని చెయ్యడమే. మూడేండ్లనుండీ బాషాషాపులో పనిచేస్తున్నాడు.

ఆరుగంటలయింది. బాషా సైకిలుషాపు మూసేసాడు. షాపు అనడమేగాని దానికి కొట్టులేదు. చౌరస్తాలో ఒకమూల పెట్టె పెట్టుకొని పనిచేస్తాడుబాషా. సాయంత్రం సైకిలు క్యారియరుపై ఆ పెట్టె పెట్టుకొని పదిహేనుకిలోమీటర్ల దూరానఉన్న తన పేటకు పోతాడుబాషా.

కాలినడకన బయలుదేరారు కోటయ్య, వెంకన్నలు బస్తీకి.

ఎవరెంత సంపాదించిందీ ఒకరినొకరు అడిగి తెలుసుకున్నారు. పోశయ్య చేసినమోసం తెలిపి మండిపడ్డాడు కోటయ్య. పోశయ్యను తెగతిట్టిపోశాడు. తనుచేసే పనిలో కూలికి ఎగుడూ దిగుడూ లేదని గర్వంగా చెప్పాడు. తన ఇంటికి వెంకన్నను తీసుకెళ్ళాడు. ఏదేచోటు దొరికేదాకా తనింట్లోనే ఉండేటట్లు వాళ్ళనాన్నతోచెప్పి ఏర్పాటు చేస్తానన్నాడు. ఇద్దరూ ఇంటికిచేరారు. పాచిపనికి వెళ్ళి వచ్చిన కోటయ్యతల్లి వెంకన్నను ఆదరించింది. ఓ గంటయిన తరువాత "వెంకన్నా బువ్వ పెట్టారారా!" అనిపిలిచింది. తిని వచ్చానని చెప్పాడు వెంకన్న. తనకొడుకుకు అన్నం పెట్టింది ఆమె. పగలు తెగతిరిగావేమోఎండలో సోమయ్య వచ్చేటప్పటికి వాకిట్లోఅరుగుమీద నిద్రపోయాడు వెంకన్న

# 5

కాలం దొర్లిపోతూ ఉంది. ఇలా రెండుఏండ్లు గడిచాయి. ఎండాకాలంలో సోమయ్య అరుగుమీద పడుకోవటం, వానా కాలంలో బస్తీలో ఉన్న రాములవారిగుడి మండపంలో నిద్ర పోవటం ఇదే వెంకన్న కాలక్షేపం. పగలు చెత్తాచెదారం ఏరటం, పోశయ్యకు అమ్మటం, రాజవ్వ పెట్టిన బువ్వతినటం, సాయంత్రం ఆరుగంటలకు బాషా సైకిలుషాపుదగ్గరికి చేరటం, కోటయ్యాతనూ కలిసి ఇంటికిరావటం ఇదీ వెంకన్న దినచర్య.



ఒకరోజు ఉదయం పదిగంటలకే బాషా సైకిలుషాపు దగ్గరకు వచ్చాడు వెంకన్న. వాడినిచూచి కళావళపడ్డాడు కోటయ్య. వెంకన్న కాళ్ళు తడబడుతున్నాయి. మనిషి గోతాలబరువును మోయలేక తూలి పడబోతున్నాడు. చేయి పట్టుకొని కూర్చోపెట్టాడు కోటయ్య. వెంకన్న వళ్ళు జ్వరంతో మండిపోతూన్నది. బాషాతోచెప్పి దగ్గరఉన్న డాక్టరుదగ్గరకు తీసుకెళ్ళాడు. 

ఆసుపత్రిలో జనంచాలమంది అప్పటికే కూర్చున్నారు. వెంకన్నను తీసుకొని లోపలికి పోబోయాడు కోటయ్య. వాకిలి దగ్గర ఉన్న మనిషి అటకాయించాడు. "క్యూలో రారా" అని గదమాయించాడు. 

"జ్వరం వచ్చిందయ్యా మా వెంకన్నకూ" ప్రాధేయ పడ్డాడు కోటయ్య. అవతలి వాడి మనసు కరగలా.

"కూర్చో" అన్నాడు. ఇంతలో కంపౌండరు బయటికి వచ్చాడు. వీళ్ళ గుడ్డలూ, వాలకం చూచి పేదవాళ్ళని గ్రహించాడు.

"అయిదు రూపాయలున్నయ్రా మీదగ్గర" ప్రశ్నించాడు కంపౌండరు.

"లేవయ్యా" బదులుచెప్పాడు కోటయ్య. "ఇది ధర్మాసుపత్రికాదురా. నాంపల్లి గవర్నమెంటు ఆసుపత్రికిపో" దబాయించాడు కంపౌండరు.

కోటయ్య కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

వెంకన్నకు చెవులు గడియలుపడి మాటలు వినపడటంలేదు.

కోటయ్య బాషాదగ్గరకువెళ్ళి ఒక రూపాయి అప్పు తీసికొని బస్సులో నాంపల్లి ఆసుపత్రికి తీసుకుపోయాడు వెంకన్నను.

వెంకన్నను ఒక మూల కూర్చోపెట్టి చీటి తెచ్చాడు. క్యూలో అరగంట పట్టింది. చీటి వ్రాసినాయన 16 నెంబరు గదికి పొమ్మన్నాడు. అక్కడికి వెంకన్నను నడిపించుకొని వెళ్ళాడు. అక్కడ ఒక డాక్టరున్నాడు. ఆయన కోటయ్య ముఖం చూచాడు. ప్రక్కనున్న వెంకన్నను గమనించాడు. చీటిమీద ఏదో ఇంగ్లీషులో వ్రాశాడు. 32 నెంబరుగదికి

పొమ్మన్నాడు. అక్కడ కంపౌండరు మూడుగోలీలిచ్చి మూడు రోజులతరువాత రమ్మన్నాడు. ఎప్పుడో తమ ప్రక్కింటి వాళ్ళకు జ్వరం వస్తే సూదిమందుఇస్తే జ్వరం తగ్గిపోయినట్లు కోటయ్యకు గుర్తు.

"సూదిమందుఇవ్వరా?" కోటయ్య కంపౌండరును అడిగాడు.

ఆ మాటవిని కంపౌండరు పకపకా నవ్వాడు. "చూడు అబ్బాయి ఇక్కడ ప్రతివాళ్ళకూ సూదిమందులు ఇవ్వరు. డాక్టరుగారికి ఇంటిదగ్గర పైకం చెల్లించినవాళ్ళకే ఇక్కడ వైద్యం" వివరించాడు.

"మరి గోలీలతోపోతుందా మా వెంకన్న జ్వరం?" కోటయ్య మరోప్రశ్న.

ఈ సారి కంపౌండరుకు కోపం వచ్చింది.

"గోలీలు వేసుకున్నా వేసుకోకపోయినా మూడు రోజుల్లో జ్వరం పోతుందిరా" విసుగుతో పలికాడు కంపౌండరు.

తమకిచ్చిన గోలీలు పనికిమాలినవని కోటయ్య గ్రహించాడు.

మెల్లగా వెంకన్నను బస్తీకి చేర్చాడు.

రెండురోజులు బాగాజ్వరంకాసింది వెంకన్నకు. పగలు రాములమ్మ అతనిని కనిపెట్టిఉంది. రాత్రికి సోమయ్య, అతని భార్య చూచేవారు.

నాలుగోరోజుకు వెంకన్న జ్వరం తగ్గింది. కాని మరీ నీరసంగా ఉన్నాడు.

ప్రొద్దున్నే కాస్త అన్నంతినమని సోమయ్యభార్య బ్రతిమలాడింది.

ఎన్నాళ్ళు తిండి పళ్ళెట్లా? వాళ్ళదీ పెద్దఉన్న సంసారం కాదు. రెక్కాడితేగాని డొక్కాడదు. ఇంటిల్లిపాదీ— మొగుడూ, పెళ్ళామూ, పిల్లాడూ బండెడు చాకిరీ చేస్తున్నారు. అక్కడ ఇంకా తింటూ కూర్చోవటం మనస్కరించలా వెంకన్నకు. తనకు ఓపికవచ్చిందని అబద్ధంఆడి గోతాలతో, జోలెతో బస్తీ నుండి బయటికి వచ్చాడు. కాని కాలనీలో తిరగలేకపోయాడు. ఇంతలో రాజవ్వ కనపడింది. అన్నపు తట్ట ఒక మూలపెట్టి

“బువ్వ తిన్నావుట్రా వెంకన్నా?” అని అడిగింది.

“తింటాలే” అన్నాడు వెంకన్న

“పిచ్చివెధవా! డబ్బులడుగుతానని భయంరానీకు— ముందు బువ్వతిను. కాస్త ఆధారం లేకపోతే పడిపడి పోతావురా” బలవంతపెట్టి వెంకన్నకు బువ్వపెట్టింది రాజవ్వ.

మూడురోజులు లంకణమేమో కాస్త ఆకలి వేసినట్లు ఉంది. అంతా తిన్నాడు! ఇంకా కొంచెం పెట్టించుకో! అని కొసరింది రాజవ్వ.

ఆమె ఇచ్చిన మంచినీళ్ళు తాగి

"అవ్వా! రేపిస్తాదమ్మలు" అంటూ లేచాడు వెంకన్న.

ఎలాగోఅలాగు గోతంచెత్త పోగుచేశాడు. పోశయ్య దగ్గరకు వెళ్ళాడు.

ఆ సరుకు తీసుకొని పోశయ్య 15 పైసలు వెంకన్నకు ఇచ్చాడు. వెంకన్నకు కడుపు మండిపోయింది.

"పోశయ్యా! ఏందయ్యా ఇంత అన్యాయం. దేనికైనా అద్దూ పద్దూ ఉండాలయ్యా" వెంకన్న కోపంగా పలికాడు.

"ఏందిరా! తిండికి లేనోడివని నేను కనిపెట్టిఉంటే నన్నే తప్పుపట్టున్నావ్. క్రొవ్వెక్కిందేరా?" దబాయించాడు పోశయ్య.

ఇప్పటికే బువ్వకు రాజవ్వకు అప్పుపడి ఉన్నాడు. ఇక రేపు జరగాలి. 15 పైసలతో ఎలా జరుగుతుంది.?

"మా బోటి గరీబోళ్ళ కడుపులుకొట్టి ఏం బావుకుంటా వయ్యా" ఎదురుప్రశ్న వేశాడు వెంకన్న.

అగ్గిమీద గుగ్గిలం పడ్డట్టయ్యింది. పోశయ్య కోపంతో ఊగిపోయాడు.

"ఏరోయ్! పిట్ట కూతకు వచ్చిందే. నాలుగు తంతే తప్ప నీ తలపొగరు పోదురా!" పోశయ్య వెంకన్నను మెడ బట్టి గెంటాడు.

దాంతో రెచ్చిపోయాడు వెంకన్న.

పోశయ్య చెయ్యికరిచి పరుగులంకించుకొని పారిపోయాడు బస్తీకి. పోశయ్య వెంటపడ్డాడు. స్థూలకాయుడు అవటంవల్ల కుర్రవాడిని పట్టుకోలేకపోయాడు.

బస్తీకి ముందున్న పెద్దరోడ్డుమీద రంగడు తారసపడ్డాడు వెంకన్నకు. ఈ అన్యాయం అంతా ఎవరికో ఒకరికి చెప్పుకుంటే తప్ప వెంకన్నకు ఉపశమనం కలుగదు. జరిగిందంతా రంగడితో చెప్పాడు. రంగడు తనమీద జాలి పడతాడని వెంకన్న ఊహించాడు. కాని అలా జరగలేదు. రంగడు వెంకన్నను అపహాస్యం చేశాడు.

"ఒరేయ్. నీలాంటివాళ్ళు ఈ పెపంచంలో ఉండబట్టే ఈ అన్నాయాలు జరుగుతున్నాయిరా."

"నేను అన్నాయం ఎప్పుడూ సేయలేదే?" తన అమాయకత్వాన్ని వెలిబుచ్చాడు వెంకన్న.

"ఓరి పిచ్చివెధవా! నువ్వు కాదురా అన్నాయంచేసేది. అది అంతా ఆ పెద్దోళ్ళురా!"



"ఈ వేళం నాదేనా?"

"వాళ్ళకు నానేం చేసాను. నామీద ఎందుకింతకోపం" అడిగాడు వెంకన్న.

"వాళ్ళకు నువ్వు ఏం చేయక్కర్లేదురా. అన్యాయాలు చేస్తేగాని వాళ్ళకు కడుపునిండదురా."

"అయితే నాను ఏం చేసేది?"

"నామాట ఇంటే నీకు రోజుకు పదిరూపాయలు దొరుకుతయ్యి."

రంగడి మాటలు వినగానే వెంకన్నకు ఆశపుట్టింది.

"ఎట్టెట్టా! నాకు చెప్పు" ప్రాధేయపడ్డాడు వెంకన్న.

"దానికేం రా! బస్సులో జేబులుకొడ్తే డబ్బు దొరుకుతుందిరా!" మంత్రోపదేశం చేశాడు రంగడు.

వెంకన్నముఖం జేవురించింది. కండగడ్డయింది.

'దొంగతనం చేయొద్దమా. దొంగతనం మాచెడ్డపని అని తన తాత చెప్పాడు కదా! డబ్బు ఇంకోళ్ళది కాజేస్తే దేవుడు శిక్షవేస్తాడని ఎంతగా తన తాత తనకు చెప్పాడో!' ఇలా అనుకుంటూ వెంకన్న

"అది పాపం కదూ" అనగల్గాడు.

రంగడు విరగబడి నవ్వాడు.

"ఒరేయ్! నీ తాతతోనే పోయిందిరా నీ మంచితనం" అని ఇంకొకడు.

"నాకొట్టుదగ్గరకు వస్తే కాళ్ళిరగతంతా" అని మరి ఇంకొకడు ఇలా వెంకన్నను నిందించి వెళ్ళగొట్టాపు దుకాణదారులు.

వెంకన్నకు కోపమూ, దుఃఖమూ ఒక్కసారి పెల్లుబికాయి. ఇందులో తన తప్పేముంది? పోళయ్య అన్యాయంచెయ్యడం బాగానేఉందా? తనునిజాయితీగా ఉండటం తన తప్పా? వీళ్ళంతా తనను ఎందుకంత అడ్డదిడ్డంగా నిందించటం? ఇలా తర్కించుకున్న వెంకన్నకు తన వృత్తి మీద రోతకలిగింది. ఆ గోతాలు అక్కడే పారేసి వెళదామని బయలుదేరాడు.

దోవలో రంగడు ఎదురైనాడు.

'ఏం! వెంకన్నా! తేల్చుకున్నావా లేదా? నాదారికొస్తే నాపత్తాసు నీకు ఎప్పుడూ ఉంటుంది.' రంగడు హెచ్చరించాడు.

వెంకన్నమారుపలకలేదు. పరధ్యానంగా నడుస్తున్నాడు.

భుజంతట్టాడు రంగడు.

ఉలిక్కిపడ్డాడు వెంకన్న.

"ఏంటిరా అలా బెదురుతున్నావు" అడిగాడు రంగడు. వెంకన్న జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

"నేను మొదట్నుంచీ చెప్పిందే జరిగిందిరా. ఆలోచించుకో" అంటూ సాగిపోయాడు రంగడు.

బస్సీ చేరాడు కాళ్ళీడ్చుకుంటూ.

బస్తీలో ఆడవాళ్ళంతా పనులకెళ్ళారు. మగాళ్ళు ఉద్యోగాలకెళ్ళారు. చిన్నపిల్లలను పెట్టుకొని కొంతమంది ఆడపిల్లలుమాత్రం ఇళ్ళముందు కూర్చొని ఉన్నారు. అప్పటికి మధ్యాహ్నం మూడుగంటలయింది.

రాములమ్మ వెంకన్నను చూసింది. రాములమ్మకు వెంకన్నమీద ఎంతో అభిమానం. ఎందుకో? నీరసంగా నడుస్తున్న వెంకన్నను చూచి పిలిచింది.

వెళ్ళాడు వెంకన్న.

రాములమ్మ ఒక్కతే ఉంటున్నది ఆ ఇంట్లో. ఆమెకు పంతొమ్మిదేండ్లుంటాయి. మంచి వయస్సులో ఉంది. చక్కని అవయవసౌష్టవంతో పొందికగా ఉంది. అందకత్తె కాకపోయినా ఆమెలో ఆకర్షించేలక్షణం ప్రస్ఫుటంగా ఉంది. ఆమెకు తల్లి తండ్రీ, తాత అవ్వా ఉన్నట్లులేదు. అక్కలు చెల్లెళ్ళూ, అన్నదమ్ముళ్ళూ ఎవరూ కనబడటంలేదు. ఆమె ఏకాకి. ఒంటరి జీవితం గడుపుతోంది. ఆమెకు పొట్టపోసుకోవడానికి డబ్బు ఎక్కడిదో?

రాములమ్మను గురించి వెంకన్నకు అట్టేతెలియదు. 'తమ్ముడూ' అని తనని ఆమెపిలవటం, ఆదరించటం మాత్రం తెలుసు.

"తమ్ముడూ! అలాఉన్నావేం? ఒంట్లో బాగాలేదా?". ఆప్యాయంగా అడిగింది రాములమ్మ. శోకరసం పెల్లుబుకింది వెంకన్న బావురుమని ఏడ్చాడు. అతని తలను తన ఒడిలో పెట్టుకొని ఆమె అతనిని ఓదార్చింది. అతనిదగ్గర 15 పైసలు కన్న లేదన్నవిషయాన్ని అతడు చెప్పిన కథనుబట్టి గ్రహించింది.

ఇంట్లోకివెళ్ళి రూపాయినోటుతెచ్చి అతని చేతిలో పెట్టింది ఆప్యాయంగా. తలనిమురుతూ "ఇది వాడుకో తమ్ముడూ!"

వద్దంటే వద్దని వాదించాడు వెంకన్న.

కాదు కూడదనిచెప్పి బలవంతంచేసి, దానిని అప్పుగా ఎంచుకోమని వెంకన్న జేబులో పెట్టించి ఆమె ఆ నోటును. దానిన్ని ఇచ్చింది. తాగి తరువాత సోమయ్యఇంటికి చేరాడు వెంకన్న.

రాత్రి భోజనాలయింతరువాత, వెంకన్న రంగడితో మాట్లాడుతూ పోవటం తను చూశానని కోటయ్య మాట వరుసకు తన తండ్రితో చెప్పాడు.

దాంతో సోమయ్య ఉగ్రుడైనాడు.

"ఆ దొంగవెధవతో తిరిగేవాడికి ఈ ఇంట్లో చోటు లేదు. వెంకన్నా! పో నా ఇంట్లోనుంచి" అని కేక వేశాడు

మంచిపడుతూ సోమయ్య తండ్రివాలకం చూచిన కోటయ్య బిత్తరపోయ్యాడు ఈ అనూహ్య పరిణామానికి. తండ్రిని బ్రతిమాలాడు. కాని సోమయ్య తనమాటమీదే ఉన్నాడు. దిగ్భ్రాంతిచెందిన వెంకన్న ఎదురుజవాబుఇవ్వలా. తడబడుతూ అడుగులువేస్తూ వెళ్ళిపోయి రామమందిరం మండపంలో పడుకున్నాడు ఆ రాత్రి. కాని నిదరపట్టలా. ఒకటే ఆలోచన. తను ఎలాబ్రతకాలి? తనకు ఇల్లులేదు. తోడునీడ లేదు. తాత అసలే లేడు, ఉద్యోగంలేదు. వృత్తిలేదు. తను చదువుకోలేదు. తనకు జబ్బుచేస్తే మందిచ్చి నయంచేయించే మనిషిలేడు. మందుకు తనవద్ద డబ్బులేదు. మందుదాకాఎందుకు? తిండికి డబ్బులేదు. తను తప్పుడుపనులు చేయలేడు, రంగడిదారి మంచిదికాదు. తనుచేపట్టలేడు. ఛీ! ఛీ! ఈ నగరం తనకు పనికిరాదు. తనను ఆదుకోదు. ఎక్కడికైనా వెళ్ళాలి. గ్రామాలకు వెళ్ళడం మంచిది. అక్కడ కసీసం గాలి వెలుతురూ ఉంటాయి. ఇలా తలపోస్తూ నిద్రలోకి జారి పోయాడు వెంకన్న.

# 7

అనుభవం మనిషికి ప్రపంచజ్ఞానాన్ని సంతరించి పెట్టుంది. తాత చనిపోయిననాటి వెంకన్నకూ ఈ నాటి వెంకన్నకూ చాలా తేడావుంది. కాకపోతే ఆనాడు వెంకన్న

నిరక్షరాస్యుడే; ఈ నాడూ అంతే. మనిషి తెలివితేటలకూ విద్యకూ సంబంధం లేదా అని తోస్తుంది. అక్షరాలు రాకపోయినా పెద్దఇంజనీరులాగా తన జీవితంలో ఏడెనిమిది వందల భవంతులు కట్టించిన తాపీమేస్త్రీలున్నారు. లెక్కలు నేర్చుకోకపోయినా నలభై ఏభై మంది కూలీలకు వారప్పు బట్వాడా పైసా తేడాలేకుండా చెల్లించే కంట్రాక్టరులున్నారు. వస్తుతః ఉన్న తెలివితేటలకు విద్యవుంటే బాగుంటుంది. ప్రజ్ఞానికి సానపెట్టినట్లుంటుంది.

వెంకన్న విజయవాడదగ్గర ఏదైనా పల్లెటూరు చేరి కాయకష్టం చేసి బ్రతకాలనుకున్నాడు. రాత్రి పదిగంటలకు బయలుదేరి రైలుబండికి పోవాలనుకున్నాడు. ప్లాటుఫారం టిక్కెట్టుకొన్నాడు. రైలెక్కాడు. ఒకపెట్టెలో ఒకమూల కూర్చున్నాడు. విజయవాడవరకు టిక్కెట్టులేదనే విషయం బయటపడకుండా టిక్కెట్టు ఉన్నవాడిలా ధైర్యంగా కూర్చున్నాడు. ఇంతలో టిక్కెట్టు తనిఖీచేసేఆయన వచ్చాడు. వెంటనే వెంకన్న మూత్రశాలలోకి పోయాడు. ఇదిగమనించని టిక్కెటుకలెక్టరు మరోపెట్టిలోకి పోయాడు. గండంతప్పింది వెంకన్నకు.

తెల్లవారింది. విజయవాడ చేరింది రైలు. ఎన్నో ప్లాటుఫారాలు; ఎన్నోరైళ్ళు, కోలాహలంగాఉంది రైలు స్టేషను. జనసమ్మర్ధం విపరీతంగా ఉన్నఆ సమయంలో అంవరు

ప్రయాణీకులు వెళ్ళే గేటుద్వారా కాకుండా మరోమార్గాన బయటపడ్డాడు వెంకన్న.

బస్సుస్టాండుకు దోవ తెలుసుకొని అక్కడికి చేరాడు. ఒకబస్సు అప్పుడే కదలబోతున్నది. ఎక్కి కూర్చున్నాడు.

బస్సు ఏ ఊరు పోతుందో తనకు తెలియదు. తను ఏ ఊరు వెళ్ళతలచుకున్నాడో తనకు తెలియదు. కండక్టరు అందరికీ టిక్కెట్లు ఇస్తున్నాడు. తనప్రక్కన కూర్చున్న పెద్దమనిషి కంకిపాడుకు టిక్కెట్టు ఇమ్మన్నాడు కండక్టరును. తనకూ కంకిపాడుకు టిక్కెట్టు కొట్టమన్నాడు వెంకన్న.

బస్సు కంకిపాడు చేరింది. కొందరు ప్రయాణీకులు దిగారు. తనూదిగాడు.

ఏం చేయాలి. ఎక్కడికి పోవాలి. ఇది పల్లెటూరులాగ లేదే. పట్టణాలలక్షణాలు ఉన్నాయే. సినిమా హాళ్ళు, అంగళ్ళు, కాఫీహోటళ్ళు, పండ్లదుకాణాలు అన్నీ కన్పడు తున్నాయి. ఆకలి తొందరపెట్టున్నది. ఎదురుగా కనిపించే ఒకచిన్న కాఫీహోటలులోకి దూరాడు. ఇడ్లీతిని కాఫీత్రాగి బయటికి వచ్చాడు.

ఏం చేయాలి? మళ్ళీ అదేప్రశ్న.

కాఫీహోటలు యజమాని వసూలు బల్లదగ్గర కూర్చున్నాడు. ఈ ఊళ్ళో ఏదైనా ఉద్యోగం దొరుకుతుందా

అని ఆయనను అడిగాడు వెంకన్న. నాలుగురోజుల క్రిందటే క్లీనరు ఉద్యోగం చేసే కుర్రాడు మానుకున్నాడు ఆ హోటల్లో. కనుక ఈ కుర్రాడిని చూడగానే ఎగిరిగంతేశాడు ప్రొప్రయిటరు.

"హోటల్లో పనిచేస్తావా?" హోటలు యజమాని వెంకన్నను అడిగాడు.

"నాను ఏ పనైనా చేస్తాను" అన్నాడు వెంకన్న.

"రెండుపూటలా భోజనం, ప్రొద్దునకాఫీ, సాయంత్రం టీ ఇచ్చి నెలకు ముప్పదిరూపాయలిస్తాను"

హైదరాదులో చెత్తచెదారం పోగుచేసి అమ్మితే తన తాతకు ఏనాడు రోజుకు రూపాయికన్నా రాలేదు. దానిలోనే తిండి, గుడ్డ అన్నీను.

హోటలు ఆయన ఇచ్చేఉద్యోగం నగరంలో తన పరిస్థితితో చూచుకుంటే ఎంతో మెరుగుగా కన్పడింది.

"సరేనండి" అన్నాడు వెంకన్న.

"ప్రొద్దున ఆరుగంటలనుండి రాత్రి పదిగంటలవరకు డ్యూటీ. మధ్యాహ్నం ఒకగంట విశ్రాంతి. హోటలులోనే పడుకోవచ్చు." షరతులు చెప్పాడు ప్రొప్రయిటరు.

"సరేసార్" అన్నాడు వెంకన్న.

వెంకన్నకు తిండిసమస్య తీరినట్లయింది. తల దాచుకోటానికి చోటు ఏర్పడింది. మరునాడు ఉదయంనుంచి డ్యూటీలో అతడు చేర్తానన్నాడు.

ఉదయం అయిదున్నరకే ప్రొప్రయిటరు తనని లేపాడు. కాలకృత్యాలు తీర్చుకొని డ్యూటీలో ప్రవేశించాడు. సర్వరు ఇచ్చిన కాఫీ తాగాడు.

ఇన్నిఏళ్ళ జీవితంలోను నిద్రలేవగానే తనకు కాఫీ ఇచ్చినవాళ్ళులేరు. కాఫీ వెంకన్నకు అమృతంలాఉంది. తన అదృష్టానికి ఉబ్బితబ్బిబయ్యాడు.

కాలం దొర్లిపోతూవున్నది. మొదట్లో ప్రొప్రయిటరు ఇచ్చిన అడ్వాన్సుపైకంతో రెండులాగులూ, రెండుచొక్కాలు కుట్టించుకున్నాడు వెంకన్న. అప్పటివరకూ తనజన్మలో తను చిరగనిదుస్తులు వేసుకోలేదు. వారానికోసారి రెండోఆట సినిమాకు వెళ్ళడానికి ప్రొప్రయిటరు అనుమతి ఇచ్చేవాడు. ఎన్టీ ఆర్ సినిమాలు అంటే ఇష్టంఅలవరచుకున్నాడు వెంకన్న. ప్రతివారం తప్పకుండా వెళ్ళేవాడు. నిజానికి రెండోఆటకు వెళ్ళి రాత్రి పన్నెండుగంటలకు ఇంటికివచ్చి మళ్ళీ తెల్లవారు జామున అయిదున్నరకేలేవడం కష్టమయినా సినిమామోజు క్రింద అది బాధగా కన్పడేదికాదు. హాలులో అందరూ సిగిరెట్లు తాగుతుంటె తనకూ త్రాగాలనిపించింది. ఒకటి

రెండుసార్లు త్రాగిచూచాడు. ఏదో తమాషాగా ఉంది. సినిమాకు వెళ్ళినప్పుడల్లా సిగరెట్లు త్రాగటం మొదలుపెట్టాడు. తర్వాత అదే అలవాటుగా మారింది.

ఆరునెలలు గడిచిపోయాయి. ప్రొప్రయిటరు ఇచ్చిన అడ్వాన్సు జీతంలో చెల్లిపోయింది. వంట్లో సత్తువ తగ్గటం ప్రారంభమయింది. పనిలో చురుకుతనం తగ్గింది. పని చేస్తున్నాడుకాని పనిలో మనసుంచి చెయ్యడంలేదు. యాంత్రికంగా సాగుతున్నది జీవితం.

హోటలుచిన్నదయినా ఎక్కువమందిజనం వస్తున్నారు. హోటలుకు మంచి పేరుండికాబోలు.

ఆ హోటలులో పన్నెండు బల్లలున్నాయి. ఒక్కొక్క బల్లదగ్గర నాలుగు కుర్చీలున్నాయి. ఒకేసారి నలభైఎనిమిది మంది కూర్చోవచ్చన్నమాట. అదేమితమాషోకాని ఉదయం ఆరుగంటలనుండి తొమ్మిదిగంటలవరకు ఏ బల్లదగ్గరా ఏకుర్చీ ఖాళీవుండదు. బల్లలమీదున్న ఖాళీకప్పులూ, సాసర్లూ, గ్లాసులు తీయడం బల్లలను శుభ్రంచేయడం తనవంతు. వాటిని దొడ్లో తోమడం, కడగడం మరో మనిషివంతు. అతడిపేరు పుల్లయ్య. హోటలు ప్రొప్రయిటరుపేరు వెంకట్రామయ్యచౌదరి.

ఒకరోజు మధ్యాహ్నం తొలిరోజులచరిత్ర గుర్తుకు వచ్చింది వెంకన్నకు.

మొదటిరోజు పని హుషారుగా చేశాడు వెంకన్న. పని క్రొత్తగా ఉండటంవల్ల అతనికి పనిలో ఆసక్తి కలిగింది. మధ్యాహ్నం పన్నెండు గంటలకు భోజనం పెట్టారు. ఒంటిగంట నుంచి రెండుగంటలవరకూ మరోకుర్రాడు పనిచేశాడు. తనకు రెస్టు. రెండుగంటలకు మళ్ళీ డ్యూటీ ఎక్కాడు సాయంత్రం నాలుగుగంటలకు టీ ఇచ్చారు. రాత్రి ఎనిమిదిగంటలకు భోజనం పెట్టారు. రాజవ్వదగ్గర తిన్న అన్నానికి దీనికి తేడా ఉంది. ఇక్కడ ఎంతో రుచిగా కన్పడ్డది.

రెండోరోజు ఉదయం పదిగంటలయ్యేసరికి కాళ్ళు పీకసాగాయి. అట్లాగే మధ్యాహ్నంవరకూ లాగాడు. మళ్ళీ సాయంత్రం పనిచేయటం కష్టమనిపించింది. మొదట్లో అలాగే ఉంటుందని మనస్సును సమాధానపరచుకున్నాడు.

ఒకరోజు ఉదయం మరోక్లీనరు ఒకగ్లాసు పగల గొట్టాడు. హోటలు ప్రొప్రయిటరు ఆ కుర్రవాడిని ఆ చెంప ఈ చెంపా వాయించి వీపుమీద రెండు గ్రుద్దులు గుద్దాడు. ఈ సంఘటన వెంకన్నకు దిగ్భ్రాంతి కల్గించింది.

ఆ రోజు రాత్రి పడుకున్నతరువాత వెంకన్న ఆలో చించడం మొదలుపెట్టాడు. హైదరాబాద్ నగరంలోని తన జీవితాన్ని కంకిపాడు జీవితాన్ని తూకంవేసి మదింపు వేయడం ప్రారంభించాడు. హైదరాబాద్‌లో జరిగిన దుస్తులు, ఇక్కడి హోటలులో భోంచేసేవాళ్ళు వేసుకునే రకపుదుస్తులు

మంచివి. నగరంలో ఏనాడు తను సినిమాచూచి ఎరగడు. ఇక్కడ వారానికి ఒకసినిమా. నగరంలో సిగిరెట్టుపొగ తనకు ఆమడదూరం. ఇప్పుడు తను దర్జాగా సిగిరెట్టు తాగుతున్నాడు. ఆనాడు ప్రొద్దున్నే కాఫీలేదు. ఇక్కడ ప్రొద్దున్నే వేడివేడి కాఫీ. అక్కడభోజనం ప్రతిరోజూ ఒకచేరకం; రాజివ్వవంట. ఇక్కడ మార్పులతో కూడిన రుచికరమైన భోజనం. అయితే కష్టాలో!

అక్కడ ఆడుతూ పాడుతూ పన్నెండుగంటలపని. ఇక్కడ నడుమువిరిగే పదిహేనుగంటలపని. నగరంలో ఏనాడు కావాలంటే ఆనాడు తనకు విశ్రాంతి. కంకిపాడులో తమ ఒకయంత్రం. హైదరాబాద్‌లో స్వచ్ఛందవృత్తి. ఇక్కడ పరాధీనత.

బేరీజువేశాడు వెంకన్న మనస్సులో. కాని ఏ జీవితం మెరుగైనదో తేల్చుకోలేకపోయాడు.

# 8

ఒకనాడు ప్రొద్దున ఎనిమిదిగంటలయింది. వెంకన్న డ్యూటీలో ఉన్నాడు. హోటలులో జనం కిటకిటలాడుతున్నారు. కుర్చీలన్నీ నిండివున్నాయి. జనం తింటున్నారు. బల్లలపై కప్పులు పాసర్లు, గ్లాసులు నిండా ఉంటున్నాయి. ఇద్దరుక్లీనర్లు

పనిచేస్తున్నారు. ఒకబిల్లదగ్గర ఒక ఆసామి టిఫినుతిని సాసరులో చెయ్యికడిగాడు. ప్రక్కన కాఫీ పెట్టిఉన్నగి. వెంకన్న ఆ బిల్లదగ్గరకువచ్చాడు. సాసరునుతీసి తనదగ్గర ఉన్న ట్రేలో పెట్టుకోవటంలో పొరపాటు దొర్లింది. సాసరులో నీళ్ళు టిఫినుతిన్న ఆసామి దుస్తులపై పడ్డాయి. ఆ పెద్దమనిషి గ్లాస్గోపంచె, గ్లాస్గోలాల్చి వేసుకొని ఉన్నాడు. ఆయనకు పట్టరాని కోపం వచ్చింది. వెంకన్నను బాచి లెంపకాయ కొట్టాడు. వెంటనే ఆ లైనులో అందించే సర్వరువచ్చి వెంకన్నను తలమీద ఒక్కపోటు పొడిచాడు. వెంకన్నకు కళ్ళుబైర్లుకమ్మినయి. కళ్ళుతిరిగి పడిపోయాడు.

"ఆ వెధవను బావగొట్టు, చూస్తావేం" అని హూంకరిస్తున్నాడు ప్రొప్రయిటరు.

"ఇటువంటి వెధవలను ఎందుకు పెట్టావయ్యా ఈ హోటలులో" అన్నాడు వెంకన్నను కొట్టిన పెద్దమనిషి.

"వస్తున్నామండీ పిళ్ళజా" అని సంజాయిషీ చెప్పు కున్నాడు ప్రొప్రయిటరు.

ఇంతలో వరోసర్వరు హీరోలాగా ముందుకువచ్చాడు. పడివున్న వెంకన్నను లేవదీసి అచెంపా ఈచెంపా వాయించి కాలరు సర్దుకొని వెళ్ళిపోయడు. ఈ దృశ్యమంత చూస్తు న్నాడు టిఫిను తీసికుంటున్న వరో పెద్దమనిషి. అతడు ఆ ఊరివాడు కానట్టిపిస్తున్నది. వెంకన్న స్థితిచూచి జాలిపడుతూ

"ప్రొప్రయిటరుగారూ! చేతులుకడుక్కోటానికి 'వాష్ బేసిను' ఏర్పాటుచేయకుండా కప్పులలో, సాసర్లలో చేతులు కడగనియ్యడం మీదితప్పు. సాసరు నిండేటట్లు నీళ్ళుపోయటం మా వంటివారితప్పు. నిండాఉన్న సాసరులోనీరు చిందకుండా ఎలా ఉంటుంది? ఆ కుర్రవాడిని తప్పుపట్టి కొట్టడం భావ్యం కాదు." అన్నాడు ఆయన

"మీకు తెలియదుసార్! వీళ్ళు మమ్మల్ని ఎంత బదనామ్‌చేస్తున్నారో!" ప్రొప్రయిటరు సమాధానం చెప్పాడు.

"ఏమయ్యా పంతులూ! ఆ కుర్రాడి వయస్సు ఉన్న నీ తమ్ముడు స్కూలులో చదువుకుంటుంటే వీడు ఇలాంటిపని చేయవలసి వచ్చింది. వాడిమీద సానుభూతి చూపించాల్సింది పోయి వాడిని బాదకొడతావా? దరిద్రం వీడిని ఈ స్థితికి తెచ్చింది." అని సర్వరును మందలించాడు ఆ పెద్దమనిషి. అంతటితో ఆగక వెంకన్నను పిలిచి అతనిచేతిలో అయిదు రూపాయలనోటుపెట్టి "బాబూ! నీ కర్మ ఇలా కాలింది. చెప్పులు తినకుండా బ్రతకడంనేర్చుకో" అని కళ్ళనీళ్ళుపెట్టుకున్నాడు ఆ పెద్దమనిషి. అప్రతిభులై చూస్తున్నారు సర్వరూ, ప్రొప్రయిటరూ. ఆ పెద్దమనిషిచర్య వాళ్ళిద్దరికీ చెంపపెట్టు కొట్టినట్లయింది.

ఇదంతా గమనిస్తున్నాడు ఖద్దరుబట్టలు కట్టుకున్న ఒక ముసలాయన. ఆయనకు అరవైఏళ్ళకు పైన వయస్సు

ఉంటుంది. ఆయన జుట్టూ కట్టూ చూస్తుంటే రైతులాగా ఉన్నాడు.

"బాబూ ఇలారా" వెంకన్నను పిలిచాడు. వెంకన్న ఆయనదగ్గరకు వెళ్ళాడు.

"చదువుకున్నావా? వెంకన్నను ప్రశ్నించాడు ఆ పెద్దమనిషి.

"లేదు"

"చదువుకుంటావా?"

'చదివిస్తే చదువుకుంటాను.'

"మా ఇంట్లో ఉండి చదువుకుందువుగాని గుడ్డలు తీసుకొని నా వెంబడి రా"

వెంకన్న చకచకా హోటలు లోభాగంలోకివెళ్ళి తన దుస్తులను తీసుకొనివచ్చి ఆ పెద్దమనిషిదగ్గ నిలబడ్డాడు.

"మీరేమీ అనుకోకండి. ఆ పిల్లవాడిని చూస్తే నాకు ముచ్చటేసింది. తీసుకొని వెళ్తాను" అని ప్రొప్రయిటరుతో చెప్పాడు ఆ దయాళాలి.

హోటలుయజమాని సిగ్గుపడ్డట్లున్నాడు వెంకన్నను పిలిచి నీకు ఈ రోజువరకు రావలసిన జీతంపదిహేను రూపాయలని చెప్పి ఆ పైకం వెంకన్నకు ఇచ్చాడు.

వెంకన్న ఆ పెద్దమనిషిని అనుసరించాడు. ఆయనది చినటగిరాం. ఆయనపేరు సుందరరామయ్య.

# 9

సుందరరామయ్య చినఓగిరాలలో పేరుప్రతిష్ఠలున్న రైతు. 1921 లో, 1930 లో, 1942 లో బ్రిటీషువారి కారాగారాల్లో మ్రగ్గిన మనిషి. గాంధీపిలుపునందుకొని స్వరాజ్యసమరంలో దూకినయోధుడు. స్వాతంత్ర్య యోధుడుగానే మిగిలిపోయాడు కాని, రాజకీయబాధితుడు కాలేదు. కాంగ్రెసు ప్రభుత్వం ఇస్తానన్న అయిదెకరాల పొలాన్ని వద్దన్నాడు. పుట్టింది కమ్మకులంలోనైనా ఏనాడు తనకులం ఫలానాఅని చెప్పి ఎరుగడు. గ్రామపంచాయితీ ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడమని ఎంతమంది బలవంతంచేసినా ప్రలోభానికి లొంగనివ్యక్తి. ఏకగ్రీవంగా పంచాయితీప్రెసిడెంటు చేస్తామన్నా యువకులకు ఆ పదవినివ్వండని హితవు చెప్పిన మహానుభావుడు. ఆయన సతీమణి యశోదమ్మ. వారిది అనుకూల దాంపత్యం. ఊళ్ళో అనాథ బాలబాలికలంతా వారి అనుంగుబిడ్డలే.

వెంకన్నలో సుందరరామయ్యకు కనపడినశుభలక్షణాలు రెండు. ఎదురుతిరిగి సర్వరును కొట్టకుండా ఊరుకోవటం. ఇది సుందరరామయ్య గాంధీదగ్గర నేర్చుకున్న అహింసా తత్వం. రెండవది వెంకన్న సుందరరూపమూ, ముఖ వర్చస్సూ. వెంకన్నది చక్కనికోలముఖం. చంపకు చారెడేసి కళ్ళు. తీర్చిదిద్దినట్లున్నముక్కు. దొండపండులాంటి పెదవులు, బొద్దుబుగ్గలు. అమాయకత్వాన్ని ప్రదర్శించే ఆ చూపులు.

వెంకన్న అందాన్ని సుందరరామయ్య చూచి మెచ్చుకునేవరకు ఆతని అందాన్ని ఎవరూ గమనించలేదు. దరిద్రుడి అందం ఎవరికి కన్పడుతుంది.?

సుందరరామయ్య ఇంటికి చేరినతరువాత వెంకన్న వాలకమే మారిపోయింది. ఇద్దరుదుస్తులు నాలుగుజతలు కుట్టించాడు సుందరరామయ్య. వెంకన్న దినచర్య మారింది. తెల్లవారుజామున నాలుగుగంటలకులేవటం. కాలకృత్యాలు తీర్చుకొని, దైవప్రార్థన చేసుకొని, నిన్నటి పాఠాలను చదువుకోవటం. ఉదయం ఎనిమిదిగంటలనుండి పదకొండువరకు సుందరరామయ్యవద్ద పాఠాలు చదువుకోవడం. మధ్యాహ్నం మూడుగంటలనుండి సాయంత్రం అయిదుగంటలవరకు సుందరరామయ్య వెంకన్నకు లోకవ్యవహారాలు, గాంధిగారి సిద్ధాంతాలు మొదలైనవి చెప్పేవాడు. రెండుసంవత్సరాలలో వెంకన్నను ఎనిమిదవ క్లాసుకు తయారుచేశాడు. ప్రవేశ పరీక్షలో కూర్చోబెట్టి క్లాసులో చేర్పించాడు.

సుందరరామయ్య అన్నీ చేశాడుకాని వెంకన్న పేరు మాత్రం మార్చలేదు. ఆయన అసలైన ఆంధ్రుడు. తెలుగు జాతిని తెలియపరచే పేరును మార్చటం సుతరామూ ఆయనకు ఇష్టంలేదు. అలా వెంకన్న విద్యాస్థాయి మారినా, ప్రపంచ జ్ఞానం పెరిగినా, రూపురేఖలు పరిణామంచెందినా వెంకన్న వెంకన్నగానే మిగిలిపోయాడు.

ఆ ఊళ్ళో ఒకే హైస్కూలు ఉంది. అందులోనే బాల బాలికలు చదువుతున్నారు. వెంకన్న క్లాసులోకి వెళ్ళి కూర్చున్నాడు. ఇంకా క్లాసుటీచరు రాలేదు. ఒక ఆకతాయి కుర్రాడు వెంకన్న దగ్గరకు వచ్చాడు. "మిష్టర్! నీ పేరేమిటి" అని అడిగాడు ఆ విద్యార్థి.

"వెంకన్న" బదులు చెప్పాడు సుందరరామయ్య పెంపుడుబిడ్డ.

ఆ అబ్బాయి పెద్దగా నవ్వాడు. తతిమ్మా విద్యార్థులంతా విరగబడి నవ్వారు. విద్యార్థినులు కిచకిచలాడారు. ఇంతలో బడిగంట కొట్టారు. క్లాసుటీచరు వచ్చాడు. విద్యార్థినీ విద్యార్థులు లేచి నిలబడ్డారు. తనూ నించోవాలి కాబోలని వెంకన్న లేచి నిలబడ్డాడు. మాష్టారు కుర్చీలో కుర్చున్నాడు. క్లాసులో అందరూ కూర్చున్నారు. వెంకన్న నిలబడే ఉన్నాడు. దాంతో మాష్టారుదృష్టిని ఆకర్షించాడు వెంకన్న.

వెంకన్న బడిలో చేరడం ఇదే మొదలు. అతడు అంతకుముందు ఏ బడి ముఖమూ చూడలేదు. వాతావరణం అంతా అతనికి క్రొత్తగా ఉన్నది. సుందరరామయ్య బడిలో చేర్పించాడు కనుక బడికివచ్చాడు.

"నీ పేరు ఏమిటి?" క్లాసుటీచరు వెంకన్నను ప్రశ్నించాడు.

"వెంకన్న"

విద్యార్థులు ఇకిలించారు. చేతిరుమాళ్ళు నోళ్ళకు అడ్డంపెట్టుకొని ముసిముసి నవ్వులు వెదజల్లారు విద్యార్థినులు.

మాస్టారుకుకూడా నవ్వొచ్చింది. అతిప్రయత్నంమీద ఆపుకున్నాడు.

ఈ అబ్బాయిని సుందరరామయ్య పెంచారని బడికో చేర్పించారని ఆ మాస్టారుకూ తెలీయదు.

"నీ తండ్రిపేరు ఏమిటి?" ఏదోప్రశ్న వేయాలికనుక మాస్టారు ఆ ప్రశ్న వేసారు.

"తెలియదు" వెంకన్న సమాధానం చెప్పాడు. క్లాసు గొల్లుమంది. విద్యార్థులు బల్లలు బాదారు. విద్యార్థినులు విరగబడి నవ్వారు.

ఇందంతా అయోమయంగా ఉంది వెంకన్నకు. సుందరరామయ్యగారు సత్యాహింసలమీద తనకు ఎంతో ప్రబోధం చేశారు. నిజాయితీ, సత్యవాక్పరిపాలన ముఖ్యమని ఆయన వెంకన్నకు చెప్పారు. దానిని నమ్మాడు వెంకన్న. ఇపుడు అలాగే నిజంచెప్పాడు. సత్యమనేది ఎందుకు హాస్య కారణమవుతుందో అతనికి తెలియలేదు. మాస్టారులో ఉండే కొంటెతనం వెలికివచ్చింది.

"నీ తల్లిపేరు ఏమిటి?" మళ్ళీప్రశ్న.

"తెలియదు" నిబ్బరంగావెంకన్న జవాబు ఇచ్చాడు.

మాస్టారు క్లాసును అదుపులో పెట్టలేకపోయారు. ఈలలు, అరుపులు, బల్లలపై డ్యాన్సులు. విద్యార్థినులు విరగబడి నవ్వారు. క్లాసు హావభావాలు మాస్టారును లోబరుచుకున్నాయి; చికాకుపరిచాయి. తన మనోభావాలను కంట్రోలు చేసుకోలేక "అయితే నీవు అబ్బ అమ్మ లేకుండా పుట్టావన్నమాట" అవహేళనచేస్తూ అన్నాడు మాస్టారు. ఆ మాట తన హుందాకే గొడ్డలిపెట్టని గ్రహించి వెంటనే నాలిక కర్చుకున్నాడు. కాని ఏం లాభం. జారవిడిచినమాట జారాడు.

క్లాసులో మాస్టారున్నాడనే మాట విద్యార్థినీ, విద్యార్థులకు ఎవరికీ స్ఫురించలేదు. విద్యార్థులు అట్టహాసంగా శబ్దం చేశారు. విద్యార్థినులు క్లాసులో పదంత్రొక్కడం ఆరంభించారు.

వెంకన్నకు తల తిరిగిపోతున్నది.

ఈక్లాసుగోల ప్రధానోపాధ్యాయునిక్లాసులో వినపడింది. ఆయన పరుగెత్తుకొని ఈ క్లాసుకు వచ్చాడు. ఆయనను చూడగానే క్లాసులో నిశ్శబ్దం ఆవరించింది.

"ఏమిటీగోల" అని గట్టిగా అరచి మాస్టారివంక చూచాడు ప్రధానోపాధ్యాయుడు.

పిల్లలూ "ఇ ఈ" అంటూ వెంకన్నవైపు వేళ్ళుపెట్టి చూపించారు.

వెంకన్న ఏదో అసందర్భపు పనిచేసి ఉంటాడని అందుకు క్లాసులోని పిల్లలంతా నవ్వి ఉంటారని ప్రధాన ఉపాధ్యాయుడు ఊహించాడు.

వెంకన్నను ఏమీ అడగకుండానే అతనిని క్లాసులో నుండి వెళ్ళిపొమ్మని ఆయన ఆజ్ఞాపించాడు.

వెంకన్న దిగులుముఖంతో వెళ్ళిపోయాడు.

స్కూలు వదిలిపెట్టకుండానే ముందుగా ఇంటికివచ్చిన వెంకన్నను సుందరరామయ్యగారిభార్య చూచి విస్తుపోయింది. అవనతముఖుడైన వెంకన్నను "ఏం నాయనా! ఇంత త్వరగా ఇంటికివచ్చావేం?" అని అడిగింది.

వెంకన్న జవాబుచెప్పకుండా తనగదిలోకివెళ్ళి ముసుగు తన్ని పడుకున్నాడు. పుట్టెడాలోచనలతో అతనితల తిరిగి పోతుంది. తనేం తప్పుచేశాడు! తానుగా ఏనాడూ ఏ పొరపాటూ చేయలేదు. ఎవరినీ నొప్పించలేదు. తండ్రి ఎవరంటే తెలియదన్నాడు. నిజంగా తనకు తెలియదు. తల్లి ఎవరంటే తెలియదన్నాడు. ఆమెపేరూతనకు ఎవరూచెప్పలేదు. తాత ఏనాడు వారిపేర్లను తన ఎదుట ఉచ్చరించలేదు. బహుశః తాతకు వారిపేర్లు తెలియవేమో! తెలిసినా తనకుచెప్పడం ఇష్టం లేదేమో. ఏదైతేనేం తనకు తల్లిదండ్రులపేర్లు పరిచయంలేదు. దీనికి క్లాసుపిల్లలు ఇంతగా ఎందుకు గోలచేయాలి. ఆ మాస్టారు ఎందుకంతగా తనపని పట్టించాలని తాపత్రయపడ్డాడు? తను

బీదవాడు కనుకనేనా? అదే పెదకాపుగారి పిల్లాడిని అలా అడుగుతాడా? సర్పంచ్‌గారి అమ్మాయిని అలా ప్రశ్నించ గలడా? దమ్ములుంటాయా మాస్టారికి? ఇంతమందికి లోకువయి ఎలా బ్రతకడం ఈ ఊళ్ళో? ఈ ప్రశ్నలరూపంగా వచ్చిన ఆలోచనలతో అతనిమనస్సు ఉడికిపోయింది.

ఆ రాత్రి భోజనాల వేళకుకూడా పొరుగూరువెళ్ళిన సుందరరామయ్య రాలేదు. మర్నాటికి వస్తామని కబురు పెట్టాడు. భోజనానికి రమ్మని సుందరరామయ్యభార్య ఎంత గోలపెట్టినా వెంకన్న ఆ రాత్రి ఎంగిలి పడలేదు.

మరునాడు వెంకన్న బడికివెళ్ళాడు. విద్యార్థినీ విద్యార్థులు ఎవ్వరూ అతన్ని పలకరించలేదు. అతడు ముభావంగా కూర్చున్నాడు. తోటివిద్యార్థులూ అలాగే ఉన్నారు. కాని అతన్ని ఏదో అసహ్యభావంతో వారు చూస్తున్నట్లు వెంకన్నకు తోచింది. ఇంతలో మూడవపిరియడులో ఒక మాస్టారువచ్చాడు. మీలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలకు చెందినవారు లేచి నిల్చోండన్నాడు. కొంతమంది విద్యార్థినీ విద్యార్థులు లేచి నిలుచున్నారు. వెంకన్న లేచి నిల్చోలేదు. వెనుకబడిన తరగతులవిషయమూ అలాగే అడిగాడు. కొంతమంది నిల్చున్నారు. వెంకన్న కూర్చునే ఉన్నాడు. వెంకన్నతప్ప తతిమ్మావాళ్ళంతా క్రిందతరగతినుండి పైతరగతికి వచ్చినవాళ్ళే. వారిలో చాలమందిని ఆ మాస్టారు ఎరుగును. వెంకన్న విషయం తెలియదు.

"వెంకన్నా! నీ కులమేది?" అడిగాడు మాస్టారు.

"లేదు"

"పోనీ నీవు పుట్టినకులం నీకు తెలుసా తెలియదా?"

"తెలియదు"

"అంటే కులగోత్రాలు లేనివాడివన్నమాట!"

వెంకన్నకు జవాబు చెప్పవలసిన అవసరం కన్పించలా.

"ఈ అప్రాచ్యుడిని బయటికి నెట్టండి" అని కొందరు రౌడీవిద్యార్థులు పెద్దగా అరిచారు.

పుస్తకాలు చేతబట్టుకొని వెంకన్న క్లాసులోంచి విసవిసా నడిచిపోయాడు.

మర్నాడు వస్తానన్న సుందరరామయ్య రాక మరో రోజుకు వాయిదా పడింది.

ఈ రెండో సంఘటన జరిగి మరునాడు పెందలకడనే సుందరరామయ్య ఇంటికి తిరిగివచ్చాడు. భార్య వాకిలితలుపు తీయగానే 'వెంకన్న బాగున్నాడా' అని భార్యను అడిగాడు. రాత్రి చదువుకొని పడుకున్నాడని ఆమె చెప్పింది. వెళ్ళి వెంకన్నను పిలిచాడు. జవాబు రాలేదు. వాడి గదితలుపు నెట్టాడు. తలుపులు తెరచుకున్నాయి. మంచంమీద వెంకన్న లేడు. పెరట్లోకి వెళ్ళాడేమోనని దొడ్డివాకిలిదగ్గరకు వెళ్ళారు. తలుపుదగ్గరకు వేసివుంది. వారిరువురు దొడ్లోకివెళ్ళారు. 'వెంకన్నా' అంటూ పలుమార్లు కేకపెట్టాడు సుందరరామయ్య.

బదులుపలుకలేదు. తత్తరపడ్తి వెంకన్నగదిలోకి వచ్చారు. మంచంమీద దిండుప్రక్కన ఉత్తరం పరచిఉన్నది. తీసి సుందరరామయ్య చదివాడు.

"బాబుగారూ! విద్యాగంధంలేని నాకు మీరు చదువు చెప్పారు. లోకజ్ఞానం నేర్పారు. నీతులుచెప్పారు. మహాత్మా గాంధి బోధలను నాకు ఎరుకపరిచారు. అమ్మగారు నన్ను కన్నతల్లికన్న మిన్నగా ఆప్యాయంగా చూచారు. తల్లిదండ్రులు లేని నేను మీ ప్రేమను చూరగొన్నాను. నా తల్లిదండ్రులు ఎవరో నాకు తెలియదు. నాకు మీరే తల్లిదండ్రులు. కాని నా జన్మకుకారకులయిన తల్లిదండ్రులపేర్లు కావాలట ఈ లోకానికి. నా కులం ఏదో తెలుసుకోవాలట ఈ ప్రపంచం. సత్యాహింస లను మరువవద్దని మీరుచెప్పిన ప్రబోధంవిని నేను నా తల్లి దండ్రులెవరో తెలియదనీ, నా కులమేదో నాకు ఎరుకలేదని నేనుచెప్తే ఈ చినటగిరాల సంస్కారులు నన్ను హేళన చేశారు; అసహ్యించుకున్నారు. ఇక్కడేఉండి వారితో పోరాడ గల ధైర్యం నాకులేదు. కనుక వెళ్ళిపోతున్నాను. మీ భార్యా భర్తలను వదలలేక వదలేక వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో! ఎందుకో! సెలవు.

ఇట్లు

మీ వెంకన్న"

సుందరరామయ్య కుప్పకూలిపోయాడు. యశోదమ్మ "వెంకన్నా" అంటూ కేకపెట్టి గోడకు జారిగిలపడ్డది.

# 10

హైదరాబాద్ వచ్చే ఎక్స్‌ప్రెస్ భువనగిరి ప్రాంతానికి చేరుతున్నది. టిక్కెట్లు తనికీచేసేఆయన వచ్చాడు ఒక పెట్టెలోకి. ఆ పెట్టెలో వెంకన్న కూర్చునిఉన్నాడు. వెంకన్నను టిక్కెట్టు చూపించమన్నాడు ఆ రైల్వే అధికారి.

"టిక్కెట్టు లేదు" అన్నాడు వెంకన్న.

"టిక్కెట్టు లేకుండా ప్రయాణంచేయటం నేరమని నీకు తెలియదా?" అడిగాడు టిక్కెట్టు కలెక్టరు.

"తెలుసు"

"తెలిస్తే టిక్కెట్టు ఎందుకు కొనలేదు"

"డబ్బులేక"

"మరి ఇప్పుడు టిక్కెట్టు పైకమూ, జరిమానా చెల్లించ గలవా"

"వాటని చెల్లించడానికి పైకం ఉంటే తప్పక టిక్కెట్టు ముందే కొని ఉండేవాడిని"

ఈ సమాధానం అతనికి కోపకారణమయింది. తనని బ్రతిమిలాడితే, తన కాళ్ళావేళ్ళా పడితే క్షమించి విడిచి పెట్టామనుకున్నాడు. కాని ఈ జవాబులు పెడసరంగా కన్పడ్డాయి. వెంకన్న నిజం చెప్పేమనిషి అని టిక్కెట్టు

కలెక్టరుకు తోచలేదు. వెంటనే "నీవు ఇక్కడే కదలకుండా కూర్చో" అని వెంకన్నను గదమాయించాడు.

"సరే" అన్నాడు వెంకన్న.

సికిందరాబాద్ స్టేషను వచ్చింది. అతడువచ్చి, వెంకన్నను దిగి తనతో రమ్మనిచెప్పి, ఏదో కాగితం వ్రాసి ఇచ్చి, రైల్వే పోలీసుస్టేషనలో అప్పచెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రికి రైల్వే పోలీసుస్టేషనలో ఒకమూల పడుకున్నాడు వెంకన్న.

'వెధవను చొక్కాలాగూ ఊడదీసి గోచీపెట్టి వెళ్ళగొడితే సరిపోయేదికదా! ఎందుకీ కేసుపెట్టాడు టి. సి.' అనిపించింది వెంటనున్న కానిస్టేబులుకు. మళ్ళీ 'కేసుల సంఖ్య ఇంతఅని చూపించాలికదా! కోటా ఉందికదా' అని పానుభూతితో టి.సి. చర్యను పరిశీలించాడు పోలీసు.

మరునాడు రైల్వే ప్లాటుఫారంమీద ఉన్న రైల్వే మేజస్ట్రీటు కోర్టులో హాజరుపరిచారు వెంకన్నను. టి. సి. సాక్ష్యంచెప్పాడు. వందరూపాయల జరిమానా, కట్టలేకపోతే అయిదువారాలశిక్ష వేశాడు మేజస్ట్రీటు.

"నీ తరఫున జరిమానా కట్టేవారెవరైనా ఉన్నారా?"

సుందరరామయ్యగారిపేరు నోటిదాకా వచ్చింది వెంకన్నకు. అతిప్రయత్నంమీద ఆపుకున్నాడు.

"లేరు" అని జవాబుచెప్పాడు వెంకన్న.

"పోనీ! నీ తరపున నీ నడతకు జామీనిచ్చేవాళ్ళెవరైనా ఉన్నారా?" మేజస్ట్రేటు మరో ప్రశ్న వేశాడు.

ఒక్కసారిగా సోమయ్య, రాములమ్మ, రంగడు వెంకన్న స్మృతిపథంలో మెదిలారు.

తమాయించుకున్నాడు.

"లేరు" అని చెప్పాడు.

"అయితే శిక్ష అనుభవించు" అని బాలనేరస్తులజైల్లో పెట్టమన్నాడు మేజస్ట్రేటు.

చంచల్‌గూడ లోని బాలనేరస్తుల జైలుకు వెంకన్నను తీసుకొనివెళ్ళారు. అక్కడ డిప్యూటీజైలరు ఇతని వివరాలను నమోదు చేసుకోడానికి కూర్చున్నాడు. పేరు అడిగి వ్రాసుకునాడు. తల్లిదండ్రుల పేర్లను చెప్పమని కోరాడు. తనకు తెలియదన్నాడు వెంకన్న. తనతో పరియాచకమాడు తున్నాడని ఆగ్రహించాడు డిప్యూటీజైలరు. చెంప ఛెళ్ళు మనిపించాడు.

వెంకన్నకు కళ్ళలో నీళ్ళుతిరిగాయి. కాని మళ్ళీ అదే సమాధానం ఇచ్చాడు. దాంతో డిప్యూటీజైలరు విసుక్కొని వెంకన్నను లోపలికి పంపించాడు.

పెద్దగేటుదాటి జైలు ఆవరణలో ప్రవేశించాడు వెంకన్న. ఎదురుగా పరుగెత్తుకొని వచ్చాడు రంగడు. వెంకన్నను కావలించుకున్నాడు.

"ఒరేయ్! నేను చెప్పలేదురా మొదట్లోనే. ఈ పెపంచకంలో మంచిగా బతకడం కుదరదురా! రంగడు తన పాతపాట మొదలెట్టాడు.

వెంకన్న వెళ్ళిపోయినతరువాత వాడికథ యేమిటో వినాలని రంగడు తహతహలాడిపోతున్నాడు. జరిగిందంతా చెప్పమని అడిగాడు. వెంకన్నకు నీరసంగా ఉంది. సుందరరామయ్యగారి ఇల్లు వదిలింతరువాత స్టేషనులలో మంచినీళ్ళతో కడుపునింపుకున్నాడు. రైల్వే పోలీసువారు అన్నం పెట్టించలేదు. "ఒరేయి రంగడూ! అన్నం తిన్న తర్వాత చెప్తానురా." అని హాల్లో తనకు ఇచ్చిన చోట్లో పడుకున్నాడు.

ఇంతలో రంగడు ఒక రొట్టెముక్క తెచ్చి వెంకన్నకు ఇచ్చాడు. అది తిన్నతరువాత గ్లాసెడు మంచినీళ్ళిచ్చాడు. సేదదీరిన తర్వాత కథ అంతా రంగడికి చెప్పాడు వెంకన్న.

"సీది ఎంత తమాషాకధరా! నా కథలోనే క్రొత్త ఏమీ లేదు" వాపోయాడు రంగడు.

తను బస్సులో జేబుకొస్తే వందరూపాయలు దొరికాయట. వందరూపాయలు దొరికాయనిచెప్పి బసు

స్టాపులో పోలీసాయనకు సగం అయిదురూపాయలు ఇచ్చి వెళ్ళిపోయాడట. పర్సు పోగొట్టుకున్నాయన "నా వంద రూపాయాలు పోయిందో" అని గోలపెట్టాడట. అంత బస్సుస్టాపులో పోలీసు ఇప్పుడే ఆ దొంగవెధవని పట్టుకొస్తానని చెప్పి తనను పట్టుకొచ్చాడట. తనమీద కేసుపెట్టి మూడునెలలు శిక్ష వేయించాడట. తనవయస్సు పదహారేండ్లలోపు ఉండటంతో బాలనేరస్థుల జైలులో తనని పడవేశారట.

ఒరేయ్! నిజంచెప్పినా నీకూ, అబద్ధం చెప్పిన నాకూ ఒకేశిక్షరా. చూశావా ప్రపంచం వ్యవహారం." అని నవ్వాడు రంగడు, జతకలిపాడు వెంకన్న.

జైలుజీవితం క్రొత్తగాఉంది వెంకన్నకు. పాతకాపు కనుక రంగడికి బాధగాలేదు.

ఒకరోజున రంగడు వెంకన్నను దగ్గరకు పిలచి అలా ఊరుచూచి వద్దామా అని అడిగాడు. అదెలా సాధ్యమని వెంకన్న ప్రశ్నించాడు.

"సీ ముఖం! నీకు ఏమీ తెలియదు, రా, నా [illegible]" అన్నాడు రంగడు

జైలుడాక్టరు దగ్గరకు తీసుకెళ్ళి వెంకన్నకు [illegible] పోటుకు, తనకు గుండెనొప్పికి దవాఖానాకు చీట్లు [illegible].

బాలనేరస్థులను దవాఖానాకు తీసుకెళ్ళటానికి ఒక పోలీసువ్యాను, స్త్రీ ఖైదీలకు మరోవ్యాను ఉంటాయి. ఆరోజు ఒకవ్యాను చెడిపోయింది. కనుక ఇద్దరికీ ఒకేవ్యాను తెచ్చారు పోలీసులు.

రంగడూ, వెంకన్నా, ఇంకా ఇతర బాలనేరస్థులూ ఎక్కారు. వ్యాను ఆడఖైదీల జైలువద్దగర ఆగింది ఆరుగురు స్త్రీలు వ్యాను ఎక్కారు. రంగడు 'రాములమ్మా' అని పిలిచాడు. స్త్రీఖైదీలలో ఒకామె తలత్రిప్పి చూచింది. ఎదురు సీటులో రంగడూ, వెంకన్న కనిపించారు ఆమెకు.

"ఏరా కులాసాగా ఉన్నార్రా?" పరామర్శించింది ఆమె. తలూపారు ఇద్దరూ. రాములమ్మ జైలుకు ఎందుకు వచ్చిందో వెంకన్నకు అర్థం కాలేదు.

"ఇక్కడికి ఎలా వచ్చావు రాములమ్మా?" ప్రశ్నించాడు వెంకన్న.

తల వంచుకుంది రాములమ్మ.

"వృత్తి చేస్తుందికదరా! అందుకని జైలుకుతెచ్చారు" సమాధానం చెప్పాడు రంగడు.

ఇంక ఎక్కువగా మాట్లాడటం మంచిదికాదని మౌనం వహించాడు వెంకన్న.

కాని వాడికి విషయం అర్ధంకాలా?

స్త్రీలు చేసే పనిని వృత్తి అంటారు? వృత్తి చేయడం చెడ్డపనా? నేరమా? వృత్తి చేసేవాళ్ళు ఆస్పత్రికి పోవాలా?

తల దిమ్ము ఎక్కింది వెంకన్నకు.

ఇంతలో వ్యాను ఆస్పత్రికి చేరింది.

ఖైదీలంతా ఆసుపత్రిలో ప్రవేశించారు. పోలీసులు వారిని తదేకదృష్టితో అనుసరిస్తున్నారు.

మరో రెండు గంటలకు జైళ్ళకు చేరారు ఖైదీలు.

## 11

రంగడు వెంకన్నకంటె ముందుగా జైలునుంచి విడుదల అయినాడు. వెళ్తూ —

"జాగ్రత్తగా ఉండరోరీ! నీ సత్తెకాలపు బుద్ధులను కాతరుచెయ్యరు ఈ జనం" అనిచెప్పి పోయాడు...

శిక్ష పూర్తి అయింది. జైలునుంచి బయటికి వచ్చే రోజు వచ్చింది. ఇకనుంచి బుద్ధిగా ఉండమని జైలరు హితబోధచేసి దుస్తులనూ ఇచ్చి పంపాడు వెంకన్నను.

వెంకన్న ఇప్పుడు మళ్ళీ స్వేచ్ఛాజీవి.

ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి. మళ్ళీ ప్రశ్నలు.



"ఈ దేశం నాదేనా?"

ఆలోచిస్తున్నకొద్దీ బుర్ర వేడెక్కుతోంది.

వెంకన్నకాళ్ళు అప్రయత్నంగా బస్తీ వేపుతీసుకెళ్ళాయి రాములమ్మ ఇంటిముందు ఆగాడు. పగటిపూట కనుక రాములమ్మ వాకిట్లో ఉంది.

"తమ్ముడూ! రా! రా! ఎప్పుడొచ్చావు జైలునుంచి?" అని ప్రశ్నలవర్షం కురిపించింది.

చేయిపట్టుకొని లాక్కెళ్ళి వరండాలో మంచంమీద కూర్చోబెట్టింది. లోపలికివెళ్ళి హడావుడిగా 'చా' తయారుచేసి తెచ్చి ఇచ్చింధి.

వెంకన్న ఏదో ఇరకాటంలో ఉన్నట్లుగా ముఖం పెట్టాడు.

"రాములమ్మా నీ రూపాయి . . ." వెంకన్న కంఠం రుద్ధమయింది.

"ఏంటిరా తమ్ముడూ! ఆ రూపాయి నీకు అప్పుగా ఇవ్వలేదు. ఊరికినే ఉంచుకుంటావని ఇచ్చాను."

రాములమ్మకూడా ధనవంతురాలేమీకాదు. అటువంటి రాములమ్మవద్ద పైకం ఊరికేతీసుకోవడం న్యాయంకాదు. అదీగాక అలా తీసుకోవటం తన ఆత్మగౌరవానికి భంగకరం. ఇలా ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు వెంకన్న.

వెంకన్న మానసికబాధ గమనించినట్లుంది రాములమ్మ.

"తమ్ముడూ! ఏంటిరా పిచ్చిఆలోచనలూ పిచ్చి ఊహలూ. అంతగా నీకు బాధగాఉంటే నాకు కావాల్సినప్పుడు నిన్నడిగి తీసుకుంటాలేవయ్యా" అనునయించింది రాములమ్మ.

సేదదీరాడు వెంకన్న. 'చా' తాగాడు.

వెంకన్న మనస్సులో రాములమ్మను, గురించిన ప్రశ్నలు కొన్ని అతన్ని దహించేస్తున్నాయి. రాములమ్మ ఏమన్నా కానివని చేస్తున్నదేమోనని అనుమానం. ఇప్పుడే ఆమెను అడగటానికి సంకోచం. వెళ్ళివస్తానంటూ లేచాడు వెంకన్న. అప్పుడప్పుడు కనపడుతుండవయ్యా అంటూ సాగనంపింది రాములమ్మ.

బస్తీలో కొద్దిదూరం నడవంగానే రంగడు కన్పడ్డాడు.

"ఏరో! ఎప్పుడు వచ్చావు బయటికి" అంటూ ఆప్యాయంగా పల్కరించాడు రంగడు.

ఇద్దరూ జైలుజీవితాన్నిగురించి చాలసేపు ఇష్టాగోష్టిగా మాట్లాడుకున్నారు.

పాతవృత్తే చేస్తున్నానని రంగడు చెప్పాడు.

"ఏరా! నా దోవకు రావూ!" అంటూ ప్రతిష్ఠాలాడు రంగడు.

"ఆలోచించనీరా" సమాధానం దాటవేశాడు వెంకన్న.

"నీవంతా సత్తెకాలపు మనిషివిరా" అంటూ ముందుకు అడుగువేశాడు రంగడు.

మళ్ళీ వెంకన్న ఒంటరివాడయినాడు.

సోమయ్యా, కోటయ్యా ఏమైనారో? ఏం చేస్తున్నారో? సోమయ్య ఇంటివైపు వెళ్ళటానికి మనస్సు అంగీకరించటం లేదు.

నాంపల్లి స్టేషనుకు నడిచాడు. ప్లాటుఫారంమీద రైలు లేదు. ప్లాటుఫారంమీదికి వెళ్ళి కడుపునిండా మంచినీళ్ళు తాగాడు. మంచినీళ్ళతో ఆకలిపోతే దేశానికి సమస్యలు చాలవరకు సమసిపోయేవి. ఆకలి, దారిద్ర్యంలాంటి వాటిని గురించి ప్రభుత్వాలు పట్టించుకోనవసరం ఉండదు. మరి అట్లాకాదే. ఆకలి దహించి వేస్తున్నది. కడుపులోకి ఏదన్నా గట్టిగా పడాలి. రాజవ్వ గుర్తుకొచ్చింది; కాని రాజవ్వ రైల్వే స్టేషన్‌వద్ద అన్నం అమ్మదు. ఆమె వ్యాపారం ఊళ్ళోనే.

ఇంతలో ఏదో రైలు వస్తున్న శబ్దమయింది. ప్లాటుఫారం మీదనే నిల్చున్నాడు. రైలు వచ్చింది. వందల మంది జనం హడావుడిగా పెట్టెలలోనుంచి దిగుతున్నారు. ఒక ప్రయాణీకుడు పెద్దపెట్టెను అతికష్టంమీద దింపుతున్నాడు. పోయంపట్టాడు వెంకన్న.

"సార్! బయటకు మోసుకురమ్మంటారా" అడిగాడు వెంకన్న.

"వద్దులేరా అబ్బాయి. రైల్వేపోర్టర్లు చూస్తే విస్సు తంతారు" అంటూ పెట్టెను లైసెన్సు కూలీచేత పట్టించుకొని పొయ్యాడు అతగాడు.

మరొకాయన మధ్యస్తంగా ఉన్న సూటుకేసును పట్టుకొని నడుస్తున్నాడు. పెట్టె అంతబరువుగ ఉన్నట్టులేదు. అతడు ఒకవైపునకు కొద్దిగా వంగి ముందు పోతున్నాడు.

"పొద్దున్నుంచి తిండిలేదుసార్! పెట్టె బయటికి తెస్తాను" అన్నాడు వెంకన్న.

వెంకన్నను తేరిపార చూచాడు ఆ ఆసామి. అతని ఇద్దరు దుస్తులను చూచాడు. అతని ముఖ వర్చస్సును గమనించాడు. జాలిపడ్డాడు. పెట్టెను వెంకన్న చేతికిచ్చాడు. వెంకన్న దాన్ని తలమీద పెట్టుకున్నాడు.

బయటి గేటుదాకా వచ్చారు ఇద్దరూ. ఇంతలో లైసెన్సు పోర్టరు వచ్చి పెట్టె లాక్కొని తన తలమీద పెట్టుకున్నాడు.

"వెధవల్లారా! మా కూట్లో మట్టి పొయ్యటానికి తయ్యారయ్యారా మీరు" అంటూ వెంకన్న మెడమీద ఒక్కటిచ్చాడు.

వెంకన్న కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఆ ఆసామికి జాలివేసింది. జేబులోనుంచి తీసి పావలాకాసు వెంకన్న చేతిలో పెట్టి గేటుదాటాడు. ఆ పావలాతో బన్రొట్టె కొనుక్కొని తిని ప్లాటుఫారం మీదనున్న మంచినీళ్ళ పంపు దగ్గర కడుపునిండా నీళ్ళు త్రాగాడు వెంకన్న. కస్త త్రాణ వచ్చింది. రైలు వెళ్ళిపోయింది. గేటుదగ్గరనున్న టిక్కెట్టు కలెక్టరు తన గదిలోకి వెళ్ళిపోయాడు. వెంకన్న స్టేషను వెలుపలికి వచ్చాడు.

పోనీ గేటుకవతల మూటలు మోస్తే. అదీ చూద్దామను కున్నాడు. అరగంటయినతరువాత మరోరైలు వచ్చింది. ఈ సారి గేటుదగ్గర నుంచొని "కూలీసార్" అంటూ అరవడం సాగించాడు. పెద్దసామాను ఉన్నవాళ్ళు రైల్వే పోర్టర్లచేత మోయించుకొని వస్తున్నారు. చిన్న సామానున్న వాళ్ళు తామే మోసుకెళుతున్నారు. తతిమ్మావాళ్ళ వెంబడి రిక్షావాళ్ళు పడుతున్నారు. సామానులను తామే మోసుకొని రావటానికి సిద్ధపడుతున్నారు. ఇక తనదాకా అవకాశం వచ్చేటట్లులేదు.

ఇంతలో ఒక బాగా లావాటి ఆసామి రొప్పుకుంటూ రొప్పుకుంటూ ఒక పెట్టెను ఈడ్చుకొస్తున్నాడు. వెంకన్నకు ఆశపుట్టింది.

"సార్! మీ పెట్టె నే మోసుకొస్తాను. మీ ఇష్టం వచ్చినంత ఇవ్వండి" ప్రాధేయపడ్డాడు వెంకన్న.

"సరే! ఎత్తుకో"

వెంకన్న పెట్టె తలమీద ఎత్తుకున్నాడు. బాగా బరువుగా ఉంది. 'తస్సాదియ్యా. రాళ్ళేమైనా పెట్టాడా?' అనిపించింది వెంకన్నకు.

ముందు లావాటి ఆయన వెనుక వెంకన్న. నడిచారు ఇద్దరూ ఓ ఫర్లాంగు. కిష్టైమండీలో ఒక ఇంటిముందు ఆగాడు ఆ పెద్దమనిషి. మేడ మెట్లెక్కి సామాను దించాడు వెంకన్న. ఆసామి వెంకన్నచేతిలో పావలాబిళ్ళ పెట్టాడు. వెంకన్న కళ్ళు తేలేశాడు.

"గ్రుడ్లప్పగించి చూస్తావేం! నీ ఇష్టం వచ్చినంత ఇమ్మన్నావుగా!" దబాయింపుగా పలికాడు లావాటి ఆసామి.

వెంకన్న మారుమాట్లాడకుండా వెనుదిరిగి వెళ్ళిపోయాడు. చౌరస్తా దగ్గరకొచ్చేటప్పటికి రాజవ్వ అన్నపు తట్టతో ఎదురయింది. ఆమె వెంకన్నను చూడలేదు. వెంకన్నే "రాజవ్వా" అని కేకపెట్టాడు. ఆమె వెనుదిరిగి చూచింది. వెంకన్న కనపడ్డాడు.

"వెంకన్నా! ఇటురారా" అంటూ పేవుమెంటు మీదికి నడిచింది.

అన్నపుతట్ట దింపింది. పైటచెంగుతో మొగంమీద చెమట తుడుచుకుంది. "ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు కనపడ్డావురా వెంకన్నా" తల నిమిరింది.

సుందరరామయ్యగారి ఇంట్లోనుంచి వచ్చిన తరువాత ఇంత వయసుమనిషి తనని ఆప్యాయంగా పలకరించలేదు. వెంకన్నకు దుఃఖం పొర్లుకొచ్చింది.

ముఖాన్ని చేతులతో కప్పుకొని భోరున ఏడ్చాడు.

"ప్రొద్దున్నుంచీ ఏమైనా తిన్నావా? బువ్వతిను" అన్నది రాజవ్వ.

ఆకులో అన్నం పెట్టి పులుసుపోసింది. ఆకు వెంకన్న చేతిలో పెట్టింది. వెంకన్న ఆకుకేసి చూస్తూ ఊరుకున్నాడు.

"తినవేంరా పిచ్చిసన్నాసి. డబ్బులడగనులే" రాజవ్వ వెంకన్నకు ధైర్యం చెప్పింది.

"అదికాదు రాజవ్వా! ఇప్పటికే నీకు ఎనభై పైసలు బాకీ. ఇపుడు నా దగ్గర పావలాకన్నా లేదు."

పకపకా నవ్వింది రాజవ్వ.

"అదా నీ గోల. ఒరేయ్ నేను సంపాదించి మేడలు కట్టక్కరలేదురా. నాకూ నా వాళ్ళకు తిండి వెళ్ళిపోతే చాలు"

రాజవ్వకు ఎవ్వరూ చుట్టాలులేరని వెంకన్నకు తెలుసు. మరి ఆమె నావాళ్ళు అంటుందేమిటి చెప్మా. ఆలోచించాడు వెంకన్న. నావాళ్ళంటే తనలాంటి వాళ్ళన్నమాట.

రాజవ్వ ఆర్ద్రహృదయానికి మనస్సులో పదివేల నమస్కారాలు చేశాడు.

గబగబా అన్నం తిన్నాడు. మంచినీళ్ళు త్రాగాడు. ఆమెచేతిలో పావలాబిళ్ళ వుంచాడు.

ఆమె అతని యోగక్షేమాలడిగింది. అతడు జరిగిన కధంతా వివరంగా చెప్పాడు. ఆమె ముక్కుమీద వేలేసుకున్నది.

"పాడులోకంరా నాయనా! పాడులోకం" అనగల్గింది రాజవ్వ.

ఇద్దరూ ఎవరిదారిన వారు పొయ్యారు.

ఈ రోజుకు ఇక కూలీ దొరికేయోగం లేదనుకున్నాడు వెంకన్న. నిద్రవస్తోందని గ్రహించి ఫిరోజ్‌గాంధి పార్కులో ఒక అరుగుమీద పడుకున్నాడు.

బాగా నిద్రపట్టింది.

అర్ధరాత్రయింది. ఎవరో తనని కర్రతో కొట్టున్నట్లు లీలగా తెలిసింది వెంకన్నకు. కళ్ళుతెరిచాడు ఎదురుగా బుర్రమీసాల పోలీసు కానిస్టేబులు. భయంపుట్టింది వెంకన్నకు.

"లేరా! నీ బోటి దొంగ . . . కొడుకులు ఎక్కడ పడితే అక్కడ తయ్యారు మా ప్రాణానికి. పోరా ఇంటికి పో గద్దించాడు కానిస్టేబులు.

"అయ్యా! నాకు ఇల్లులేదయ్యా! ఇక్కడ నన్ను పడుకోనీండయ్యా" బ్రతిమాలాడు వెంకన్న.

"పోలీసోళ్ళకి మాకే క్వార్టర్సులేవు. మీకేం ఇళ్ళుంటాయిరా! అయినా ఏం చేస్తాం. డ్యూటీ అంటే డ్యూటే. పార్కులో పడుకోరాదు. తెలుసా? లేచిపో" గర్జించాడు పోలీసు.

మళ్ళీ రోడ్డున పడ్డాడు వెంకన్న.

నాంపల్లి రైల్వే ప్లాటుఫారం మీదకుపోయి చివరనున్న సిమెంటు బెంచీమీద పడుకున్నాడు. నిద్రపట్టింది.

తెల్లవారుజామున ఎవరో తనను లేపుతున్నారు. కళ్ళు నలుముకుంటూ లేచాడు. ఎదురుగా రైల్వే పోలీసు వణికి పోయాడు వెంకన్న.

"ఏరా! రాస్కెల్ మళ్ళీ ఇక్కడికి తయారయ్యావ్? కేక పెట్టాడు పోలీసు.

వెంకన్న అతన్ని గుర్తుపట్టాడు. ఆ రోజురాత్రి తను సికిందరాబాదు రైల్వే పోలీసు స్టేషనులో బందీగా ఉన్నపుడు కాపలా ఉన్న పోలీసే ఈయన.

"అప్పుడు రైలుటిక్కెట్టులేదు. ఇప్పుడు జేబులు కొట్టడానికి వచ్చావుట్రా?" లాఠీ ఝుళిపించాడు పోలీసు

వెంకన్న లేచి పరుగులంకించుకున్నాడు. తృప్తిగా నవ్వాడు పోలీసు.

## 12

ఒకనాడు ఉదయం సిటీబస్సు స్టేషను దగ్గరకు పోయాడు వెంకన్న కూలి దొరుకుతుందేమోనని. ఒక యువకుడు టీపీగా ఆటో దిగాడు.

"పార్! సామాను బస్సుమీద ఎక్కిస్తా" అంటూ వెంకన్న అతనిదగ్గరకు వెళ్ళాడు.

ఇంతలో ఎక్కడినుంచి వచ్చారో ఏమో బలిష్టులైన నలుగురు లైసెన్సుడు పోర్టర్లు వచ్చారు.

ఒకడు ఆ యువకుడిపెట్టె ఎత్తుకున్నాడు.

"ఏరా! వెధవనాయాలా! మాకు కూలీ దొరక్కుండా అడ్డుపడతావు. తన్నులుతింటావు జాగ్రత్త" బెదిరించాడు మరొక పోర్టరు. మిగతా ఇద్దరు పోర్టర్లు వెంకన్నమీద పడి చబచబా వీపుమీద బాదారు. గుంపుచేరింది. ఏమయిందీ ఎవరికీ తెలియదు; కాని గుంపులో జనం

"తన్నండి దొంగవెధవని"

"వీపు చితక్కొట్టండి"

"ఈ జేబుదొంగలకు ఇలాగే శాస్తి జరగాలి" అంటూ తలో దెబ్బ వెంకన్న తలమీద, చేతులమీద, ఛాతీమీద, వీపుమీద వేశారు. నలభయి ఏభయి దెబ్బలు తగిలివుంటాయి. పడిపోయాడు వెంకన్న. చచ్చేడేమోనని భయపడి విజృంభించిన వీరులు చక్కా జారుకున్నారు.

కొంత సేపటికి తెప్పరిల్లాడు. చుట్టూ ఎవరూలేరు. లేచి చకచకా నడిచిపోయాడు బస్సుస్టాండు అవతలకి.

ప్రొద్దున్నుంచి 'చా' నీళ్ళుకూడా తాగలేదు వెంకన్న. జేబులో పైసలులేవు. కాళ్ళు రాములమ్మ ఇంటికి దారితీసినయి. రాములమ్మ వాకిట్లోనే కూర్చొని ఉన్నది. వెంకన్నను చూచి ఆదరంగా ఆహ్వానించి ఇంట్లోకివెళ్ళి 'చా' తెచ్చి ఇచ్చింది. తాగాడు.

"చాల రోజులయింది కన్పడి తమ్ముడూ" అని ఆప్యాయంగా అడిగింది.

వెంకన్న జీవితాన్నిగురించి ప్రశ్నలు వేసి తెలుసుకుంది. జాలిపడ్డది. "పగలు ఎప్పుడైనా సరే నీవు వచ్చి 'చా' తాగి పోవచ్చు; లేదా బువ్వతిని పోవచ్చు" రాములమ్మ వెంకన్నకు ఎరుకపర్చింది.

"సరే" తల ఊపాడు వెంకన్న.

కాని అతనికి అర్థంకాని విషయం ఒకటి ఉన్నది. అదేమంటే ఎప్పుడూ తనని ఆమె ఇంటి వరండాలో పడుకోమని పిలవకపోవటం. ఇందులో ఏదో అంతర్యం ఉందనుకున్నాడు వెంకన్న.

వెళ్తానని చెప్పి లేచి సబ్ జీమండీ మార్కెటుకు వెళ్ళాడు. ఎవరో చెప్పారు అక్కడ బాగా కూలి దొరుకుతుందని.

మార్కెటు జనంతో చాల రద్దీగా ఉంది. కొంతమంది స్కూటర్లవాళ్ళు, కొంతమంది సైకిలుపై వచ్చినవారు, కాల్నడకవాళ్ళు అబ్బో ఎంతో సందడి.

బండ్లమీద కూరలు అమ్మేవాళ్ళు తట్టలతో తీసుకెళ్ళి బండ్లమీద పోసుకుంటున్నారు. కూరగాయలు తట్టలో మోసుకెళ్ళి అమ్మేవాళ్ళు తామే తట్టలు నెత్తిన పెట్టుకొని వెళ్తున్నారు. స్కూటర్లవాళ్ళకు, సైకిళ్ళవాళ్ళకు సంచులున్నాయి వాటిని వాహనాలకు తగిలించుకొని వెళ్తున్నారు. తనను కూలికి ఎవరూ పిలవడంలేదు. ఇంతలో పెద్ద పట్టుచీరె ఆవిడ కన్పడింది. ఆశపుట్టింది వెంకన్నకు.

"అమ్మగారూ! కూలీ కావాలా" అడిగాడు వెంకన్న.

ఆమె అరగంటసేపు మార్కెటు అంతా తిప్పి తట్టెడు కూరలుకొని పట్టించుకొని ఆటో దగ్గరదాకా తీసుకెళ్ళి పావలాకాసు వెంకన్న చేతిలో పెట్టింది.

విస్తుపోయాడు వెంకన్న. ఆమెను ఎగాదిగా చూచాడు.

"ఏరా! అలాచూస్తావు. నీవు చేసినపనికి అదిచాలులే." దబాయించి ఆటోఎక్కి ఆమె వెళ్ళిపోయింది.

కాళ్ళీడ్చుకుంటూ చౌరస్తా చేరాడు.

రాజవ్వ అన్నపుతట్టతో కనపడ్డది. ఆమెను చూస్తే ప్రాణం లేచివచ్చింది. ఆమెదగ్గరకు వెళ్ళాడు.

"అవ్వా" అని పిలిచాడు.

"రారా వెంకన్నా!" పిలిచి వెంకన్న చేతిలో అన్నపు ఆకు పెట్టింది రాజవ్వ.

ఆమె కోరిక మేరకు తన కష్టాలూ సుఖాలూ ఆమెకు చెప్పాడు వెంకన్న.

ఆబిడ్స్ షాపుల ప్రాంతంలో కూలి దొరుకుతుందేమో నని సాయంత్రం అంతా తిరిగాడు. పిల్చినవాడు లేడు. చీకటి పడపోతున్నది. ఎక్కడో అక్కడ తలదాచుకోవాలి. రామాలయానికి పోదామంటే దానికి పెద్ద సోమయ్య. తనని వెళ్ళగొట్టిన సోమయ్య పెత్తనంలో ఉన్నచోటికి ఎలాపోతాడు? రైల్వేప్లాటుఫారంమీద ఆ పాతపోలీసు యముడిలా తిరుగు తున్నాడు. పార్కులలో పడుకుంటే వెళ్ళగొట్టున్నారు. ఇపుడు నాంపల్లి చుట్టుప్రక్కల ఉన్న పార్కులన్నింటిలో తను

పడుకోవటమూ, పోలీసులు వెళ్ళగొట్టడమూ జరిగింది. ఆ పోలీసులకు తన మొగం బాగా తెలుసు.

ఇపుడు కొన్నినెలలుగా రోడ్డుప్రక్కన పడవేసిన సిమెంటు తూములలో పడుకుంటున్నాడు. ఇవేసయం చలినుండి, వాననుండి మనిషిని కాపాడతాయి.

తూములోకి దూరాడు వెంకన్న. లోపల ఒక కుక్క భౌ భౌ అని మీదికి వచ్చింది. ఆ తూమును వదలి మరో తూములో దూరాడు. నిద్రపట్టింది. అర్ధరాత్రి బుమ్ బుమ్మని సన్నగా సీలగా ధ్వని వినపడింది. అది ఎలుక చేసేశబ్దంకాదు పందికొక్కు అని గ్రహించాడు. పెద్దగా అరిచాడు; అది పారిపోయింది.

తరువాత ఒక గంటవరకు వెంకన్నకు నిదరరాలేదు. ఇంతలో ఒకకుక్క తోకముడుచుకొని తూములోకి వచ్చింది. భయపడుతున్నట్లుంది. దానిని తరిమివేయడానికి మనస్కరించ లేదు. పాపం! అదీ తనలాగే ఆశ్రయంకోరుతున్నది. తనకూ ఆ కుక్కకూ తల దాచుకోడానికి చోటు ఇవ్వలేకపోయింది సమాజం.

సమాజంమీద కసి పుట్టుకొచ్చింది. అతని బుర్ర వేడెక్కుతున్నది ఆలోచిస్తున్నకొద్దీ.

కొంతమందికి పుట్టుకతోనే భోగాలు ఎందుకుంటాయి? కొంతమంది పుట్టు పరిద్రులుగా ఎందుకు పుడ్తున్నారు?

ఇది అంతా పూర్వజన్మ కర్మఅనుకుంటే సరిపోతుందా? పూర్వజన్మను చూచి వచ్చిన వాడెవడైనా ఉన్నాడా? ఫలానా కర్మచేస్తే ఫలానా ప్రతిఫలమనో, ఫలానా శిక్ష అనో ఎవరు చెప్పగలరు? దేవుడు చెప్పాడా? దేవుడిపేరుతో పూజారులు, మతగురువులు చెప్తున్నారా? అసలు ఆ మాటకువస్తే దేవుడు వున్నాడా? ఉంటే కనపడదేం? ప్రపంచంలో ఇంత అన్యాయం, ఇంత అవినీతి జరుగుతుంటే చూస్తూ ఊరుకుంటాదేం? దేవుడు గ్రుడ్డివాడా? బీదల ఆక్రందనలు, బాధితుల ఆక్రోశాలు ఆయనకు వినపడవా? వినివడవేమో! దేవుడు చెవిటివాడేమో! ఏమోపాపం! దేవుడికి జోక్యం కలుగచేసుకోటానికి అధికారం లేదేమో! అంతా కర్మప్రకారం జరుగుతుందేమో! అధికారంలేని దేవుడిని, దెబెలాగా గ్రుడ్లప్పగించి చూసే దేవుడిని ఎందుకు పూజించాలి? మరి సుందరరామయ్యగారు దేవుడు చాల మంచి వాడని చెప్పాడే! అంతమంచిదేవుడు తనను ఎందుకు ఈ బాధల పాలు జేస్తున్నట్లు? తనను పరీక్షిస్తున్నాడా దేవుడు? ఏమిటి, తనను-పరీక్షించేది? తను ఏ తప్పు చేసాడు కనుక. ఇంకనూ తన తల్లిదండ్రులు ఎవరో కూడ తెలియదే! అసలు ఆ మాటకువస్తేతన పుటకకు ఎవరు కారకులు. దేవుడా లేక తన తల్లిదండ్రులా? లేక తనా? ఏమో ఈ సమస్య తెగటంలేదు వెంకన్నకు. తాత చెప్పినమాటలు జ్ఞాపకం వస్తున్నాయి.

"బాబూ వెంకన్నా! దేవుని నమ్మినవాడు ఎప్పుడూ చెడలేదురా!" అన్నాడు ఆ నాడు తాత.

"దేవుడు కరుణామయుడయ్యా; సత్యస్వరూపుడు కూడాను. సత్యాహింసల మార్గాన పోతేనే ఆయన దయ మనమీద ప్రసరిస్తుందయ్యా" ఇవి సుందరరామయ్యగారి మాటలు.

ఇప్పుడు తను ఆలోచిస్తుంటే ఆ మాటలు నిజం కాదేమోననే భావం పుట్టున్నది తనలో.

మరి అలా ఊహించటం తప్పేమో!

అయినా తాతకన్నా, సుందరరామయ్యగారికన్నా తనకు ఎక్కువ తెలుసా? వాళ్ళిద్దరూ జీవితంలో పండిపోయిన వాళ్ళు; కాచివడపోసినవాళ్ళు.

ఇటు తన ఆలోచనా, అటు పెద్దలమాట. ఈ రెంటికీ వైరుధ్యం కనబడుతోంది. ఇటు తనూ అటు తనను నలిపివేస్తున్న సమాజం.

ఇంతవరకూ తను సమాజానికి ద్రోహం చేయలేదు; సమాజాన్ని నష్టపరచలేదు. కాని ఈ సమాజం తనను అట్టడుగుకు త్రొక్కేస్తున్నది. తను బతకగల్గేన? ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు వెంకన్న. ఇంతలో తెల్లారింది.

# 13

కాలం గడిచిపోతూ ఉంది. వెంకన్నకు పదిహేడేళ్లు నిండాయి. ఒకరోజు ప్రొద్దున్నే వెంకన్నకు రంగడు తటస్థపడ్డాడు. రంగడు పైలాపచ్చీసువేషంలో ఉన్నాడు. టెర్రికాటు పాంటు, టెర్లిన్‌చొక్కా వేసుకున్నాడు. చొక్కా జేబులో పదిరూపాయలనోటు బయటికి కనిపిస్తున్నాది.

"ఒరేయ్ వెంకన్నా! స్నేహితులతో కలిసి సినిమాకు వెళ్ళి చాలరోజులయిందిరా. ఈ సాయంత్రం మొదటిఆటకు సినిమాకు వెళ్దాం. చౌరస్తాకు రా. నేనూ వస్తాను సాయంత్రం ఆయిదింటికి అక్కడికి." సినిమాకు పిలిచాడు రంగడు.

గతుక్కుమన్నాడు వెంకన్న. తనదగ్గర అర్ధరూపాయి తప్ప పైకంలేదు. రాజవ్వబాకీ ఇంకా తీర్చలేదు. రాములమ్మ దగ్గర తీసుకున్న పైకం రూపాయి ఇంకా ఆమెకు తిరిగి ఇవ్వలేదు. చివరక్లాసు టిక్కెట్టు ఒకఅర్ధరూపాయి; పైఖర్చుకు మనిషికి అర్ధరూపాయన్నా అవుతుంది.

"నా దగ్గర పైసలు లేవురా. నేనురాను" ఆహ్వానాన్ని తిరస్కరించాడు వెంకన్న.

"ఒరేయ్! నిన్ను డబ్బుపెట్టమని నేను అడగలేదురా నా దగ్గర డబ్బున్నది. ఇదిగో" జేబు చూపించాడు రంగడు.

వెంకన్నకు ఆశ్చర్యంవేసింది. రంగడిదగ్గర ఇంత డబ్బు ఎలా మెదులు తుందాయని విస్తుపోయాడు. ఇంతలో జ్ఞాపకం వచ్చింది రంగడి వృత్తి విషయం. మళ్ళీ మనసులో తర్జన భర్జన మొదలయింది.

రంగడు చేసేది పాడుపని – జేబులుకొట్టడం. వాడి దగ్గర ఉండేది పాడుడబ్బు. ఆ చెడ్డడబ్బుతో తను మంచిపని– సినిమాచూడటం చెయ్యవచ్చా?

మంచిలక్ష్యాలు మంచిమార్గాలద్వారానే సాధించాలని గాంధిమహాత్ముడు చెప్పాడని సుందరరామయ్యగారు చెప్పారే!

పాపిష్టి పనిచేసి సంపాదించేడబ్బు విషంతో సమానమని తాత చెప్పేవాడే!

మరి ఇపుడు రంగడి డబ్బుతో సినిమాకు పోవడమా మానడమా?

తెగటంలేదు ఆలోచన. వెంకన్న వాలకం చూచాడు రంగడు.

"ఏంటిరా నీ గుంజాటన?" అడిగాడు రంగడు. తన సందేహాన్ని వెలిబుచ్చాడు వెంకన్న.

రంగడికి కోపం వచ్చింది.

"ఒరేయ్ ముందు నేను అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్తావా?" సవాలు చేశాడు రంగడు.

"అవును" అన్నాడు వెంకన్న.

"నీవు కష్టపడుతున్నావుకదా! నీకు డబ్బు ఎందుకు లేదు? ఆ కార్లలో తిరిగే ఆసామికి ఎందుకుఉంది?"

"అదేరా నాకు అర్థంకావటంలేదు." తన మనస్సులోని అయోమయాన్ని అంగీకరించాడు వెంకన్న.

"నేనుచెప్తావిను. వాళ్ళనాన్నకు డబ్బుంది. మీ నాన్నకు డబ్బులేదు." పెద్ద గొప్పవిషయం చెప్పినట్లు సగర్వంగా చూచాడు రంగడు వెంకన్నవైపు.

"మరి వాళ్ళనాన్నకు డబ్బు ఎలా వచ్చింది?" ప్రశ్నవేయటం ఈసారి వెంకన్నవంతు అయింది.

"అదగదీ! దారికివచ్చావు. వాడితాతడబ్బు వాడినాన్నకు వచ్చింది. వాడిముత్తాతడబ్బు వాడితాతకు వచ్చింది. ఇలా . . . ఇలా . . ."

రంగడి జవాబు సమస్యను తెగనరకటంలేదు.

"మొదట్లో, కారులో తిరిగే ఆసామి పూర్వీకుడికి డబ్బు ఎలా వచ్చిందీ?" వెంకన్న మరోప్రశ్న.

"అదా నీ అనుమానం. మీ నాన్న పూర్వీకుడ్ని తన్ని కారులో తిరిగే ఆయన పూర్వీకుడు లాక్కున్నాడన్నమాట" ధీమాగా చూచాడు రంగడు.

"ఇంతకూ నీవు అనేది ఏమిట్రా?" వెంకన్న రంగడిని నిలదీసి అడిగాడు.

రంగడి మనస్సు సంతోషంతో నిండిపోయింది. వెంకన్నను మార్చగలుగుతున్నాననే తృప్తి వాడిలో పొడసూపుతున్నది.

"నేననేది ఒకటేరా. ఒకడు మరొకడి డబ్బు కాజేయకుండా డబ్బు ఒకచోట చేరదురా. కనుక నేను బస్సులో ఇంకోడివర్సు కొట్టేస్తేతప్పులేదురా" రంగడు విజయ గర్వంతో ఊగిపోతున్నాడు.

రంగడి వాదనను కాదనగలశక్తి వెంకన్నకు లేక పోయింది. కాని మనస్సులో, అంతరాంతరాలలో రంగడి మాటల్లో ఏదో తప్పులున్నట్లు అనుమానంగా ఉంది. ఎట్లయినా రంగడిని వాదనలో చిత్తుచేయాలని వెంకన్నకు తోచింది.

"రంగడూ! నీవు చెప్పినమాటలు మంచివనే అనుకుందాం మాటవరసకు. అయితే నీవు జేబులుకొట్టేటపుడు బీదవాళ్ళపరుస్సులు, మధతరగతివాళ్ళ పర్సులు కూడా కొట్టేస్తావుకదా! వారు ఎంత బాధపడతారో ఆ పైకంలేక! ఆలోచించావా?" ఈ ప్రశ్నతో రంగడిపని సరి అనుకున్నాడు వెంకన్న. రంగడు బెదరలా.

"ఆలోచించలేదు; ఆలోచించవలసిన అవసరం లేదు. నా దృష్టి పర్సుమీదేగాని మనీపర్సు ఎవరిదనికాదు. ఒకవేళ ఆ మనీపర్సు బీదవాడిదనే వప్పుకుందాము. ఒరేయ్ ఈ సమాజం నీకు ఏం చేసింది? తిండిపెట్టలేదు; ఉద్యోగం ఇవ్వలేదు; తల దాచుకోడానికి ఇల్లు ఇవ్వలేదు. చదువు చెప్పించలేదు, రోగంవస్తే మందు ఇప్పించలేదు. ఈ సమాజం మంచిదంటావురా? అలాంటి సమాజాన్ని నాశనం చేయడానికి పూనుకోకుండా దానితో రాజీపడి బ్రతికే బీదవాళ్ళకు ఆ శిక్ష ఉండాల్సిందేరా!" దీర్ఘోపన్యాసం చేశాడు రంగడు. జైల్లో పడకముందు రంగడువేరు. ఈనాటి రంగడువేరు. వాడి భాషమారింది. వాడి ఆలోచనలకు పదునువచ్చింది.

"సినిమాకు వస్తాలేరా" వెంకన్న ఈ విధంగా తన ఓటమి అంగీకరించాడు.

అనుకున్నవేళకు ఇద్దరుమిత్రులూ కలిశారు చౌరస్తా దగ్గర. ఇంగ్లీషు సినిమాకు తీసుకెళ్ళాడు రంగడు. కుర్చీ క్లాసులో కూర్చోపెట్టాడు వెంకన్నను. ప్రక్కన తను కూర్చున్నాడు. రెండు కూల్‌డ్రింకులు తెప్పించాడు.

ఇంతవరకు స్టంటు సినిమాలు చూచాడు వెంకన్న. అదైనా కంకిపాడులో. హోటల్లో క్లీనరు ఉద్యోగం మానివేసిన తర్వాత మళ్ళీ వెంకన్న సినిమా చూడటం పడలేదు.

ఇప్పుడు హైదరాబాద్‌లో ఏక్‌టిమ్ ఇంగ్లీషు సినిమా. పైగా ప్రేమసినిమా. భాష అర్థం కావటంలేదు. కాని సన్నివేశాలు అర్థం అవుతున్నాయి. కౌగిలింతలు, ముద్దులు, కలసి గెంతడాలు, ఒకరిపై మరొకరు ఒరిగిపోవడాలు అంతా స్త్రీ పురుషుల సంబంధమయం. రంగడు వెంకన్నకన్న రెండేళ్ళు పెద్ద. వాడు తన్మయత్వంతో చూస్తున్నాడు. వెంకన్నకు ఈ సినిమా చూస్తున్నంతసేపూ ఎవరో చక్కిలిగింత పెడుతున్నట్లుంది. కాని తమాషా ఏమంటే వెంకన్నకు సినిమా చూడబుద్ధయింది.

సినిమా అయిపోయింది. ఇద్దరూ బయటికి వచ్చారు. రద్దీని తప్పుకోటానికి నిల్చున్నారు ఒకచోట. ఇంతలో పద్దెనిమిదేండ్ల ప్రాయంలో ఉన్న ఇద్దరు స్త్రీలు వీరి ప్రక్కకు వచ్చి ఆగారు. అందులో ఒకామె రంగడిని పలకరించింది.

"సినిమా నచ్చిందా?" అని రంగడిని ప్రశ్నించింది.

"బలే మజాగా ఉంది" అన్నాడు రంగడు.

రెండో అమ్మాయి ఓరకంట వెంకన్నవైపు చూస్తున్నది రెప్ప ఆర్పకుండా.

"వస్తాలే" అని సాగిపోయాడు రంగడు. వెంకన్న వాడిని అనుసరించాడు. వాళ్ళ భోగట్టా అడిగిన వెంకన్నకు వాళ్ళ పేర్లు చెప్పాడు రంగడు. "నన్ను పలకరించిన అమ్మాయి పేరు రాంప్యారి. రెండో అమ్మాయి పేరు రోజా. వాళ్ళిద్దరూ

స్నేహితులు. కలసి తిరుగుతుంటారు. రాంప్యారీకి నాకూ స్నేహం" వివరించాడు రంగడు.

రోజా అనే అమ్మాయి అందంగా కన్పించింది వెంకన్న కళ్ళకు. ఆమెతో మాట్లాడాలని కోరిక కల్గింది తనకు.

ఇంతలో రోజా తన ప్రక్కకువచ్చి

"నేను ఉండేది బస్సుస్టేషనునుండి అఫ్జల్ గంజ్‌కు పోయే దోవలో కుడిచేతివైపు రెండో సందులో ఎడమవైపు రెండోఇల్లు" అనిచెప్పి చకచకా వెళ్ళిపోయింది.

ఈ మాటలు విన్న వెంకన్నకు రోజా తన బుగ్గ నిమిరినట్లు తోచింది. పులకితుడయినాడు. ఎవరిగూటికి వారు చేరారు మిత్రులిద్దరూ.

## 14

సినిమా చూచినప్పటినుండి వెంకన్న కళ్ళల్లో రోజా మెదలుతున్నది. ఆమెను చూడాలని, ఆమెను సినిమాకు తీసుకొని వెళ్ళాలని, ఆమెప్రక్కన తను నించోవాలని, ఆమెను తాకాలనీ, ఇంకా ఎన్నో ఎన్నో చిత్రవిచిత్రమైన ఊహలు అతని మెదడులో ఉద్భవించాయి. సినిమాకు పోవటానికి డబ్బు కావాలి. ప్రతిరోజూ తను సంపాదించే డబ్బు తన తిండికే చాలటంలేదు. తనకు ఇల్లులేదు. రోజాకు ఇల్లుఉంది. రోజా తనకన్నా పై అంతస్తు మనిషి. ఆమెతో స్నేహం

చేయాలంటే తను బాగా డబ్బు సంపాదించాలి. ఇలా ఆలోచించి వృత్తి మార్చాలని నిర్ణయించుకున్నాడు వెంకన్న.

ఎవరైనా సలహా చెప్తే బాగుండును. ఎవరున్నారు తనకు - రాజవ్వ, రంగడూ, రాములమ్మా. రాజవ్వకు ఏం తెలుసు ప్రపంచ వ్యవహారం? రంగడిని అడిగితే తనవృత్తి- జేబులుకొట్టడం - లోకి రమ్మంటాడు. ఇక రాములమ్మను అడగాలని నిశ్చయించుకున్నాడు వెంకన్న.

ఒకరోజు సాయంత్రం చీకటిపడే వేళకు రాములమ్మ ఇంటికి వెళ్ళాడు వెంకన్న. ఇతనిని చూచి కళవళపడింది రాములమ్మ. మామూలుగా ఎంతో ఆప్యాయంగా మాట్లాడే మనిషి ఆవేళ ముభావంగా ఉంది. 'చా' నీళ్ళు తెచ్చి ఇవ్వలేదు, ఆమె వైఖరి అతనికి ఆశ్చర్యం కలిగించింది. తను వచ్చినపని చెప్పాడు రాములమ్మకు. రోజా సంగతికూడా వివరించాడు. అంతా విని రాములమ్మ మౌనంగా ఉండిపోయింది. ఆ నిశ్శబ్ద వాతావరణం దుర్భరంగా తోచింది వెంకన్నకు. వెళ్ళి వస్తానని లేచాడు.

"వెంకన్నా! ఈ రాత్రికి ఇక్కడ బువ్వతిని వరండాలో తొంగోమని చెప్పే తాహతు నాకులేదు. ఏమీ అనుకోకు. రేపు ప్రొద్దున రా. మాట్లాడుకుందాము" అని బెదురుచూపులు చూస్తూ చెప్పింది రాములమ్మ.

ఇంతలో ఒకడు తూలుతూ రాములమ్మ ఇంటి దగ్గరకు వస్తున్నాడు.

"ఎవడేవీడు? కొత్త కుర్రాడిని తెచ్చుకున్నావేటి? బిల్ పసందుగా ఉన్నాడే! వీడిని తరిమివెయ్యవే రాములూ" గట్టిగా అరిచాడు ఆ వచ్చిన నడివయస్సు మనిషి.

చూస్తే కాయకష్టం చేసే వ్యక్తిగానే కనిపిస్తున్నాడు.

"మా తమ్ముడే లేవయ్యా. ఎప్పుడూ పాడుఅనుమానం నీకు." కొత్త మనిషిని క్రీగంట చూసింది రాములమ్మ.

ఇదంతా చూస్తున్న వెంకన్నకు కంపరం పుట్టున్నది.

వీడెవడు? ఇతడికి రాములమ్మమీద ఏంటి అధికారం? వీడు రాములమ్మ మొగుడా? అలాంటివాడిని తను ఎప్పుడూ చూడలేదే? ఇంతలో రాములమ్మ వృత్తి చేస్తుందని జైల్లో రంగడు చెప్పినమాట గుర్తుకు వచ్చింది వెంకన్నకు. కొత్త మనిషిదగ్గరకు వెళ్ళాడు వెంకన్న.

"ఎవరునువ్వు. మా రాములమ్మను దబాయించటానికి నీ వెవడవోయి?" అరిచాడు వెంకన్న.

కొత్త వ్యక్తి కంగారుపడ్డాడు. ఇన్నాళ్ళుగా తనని ఇలాంటి ప్రశ్న ఎవరూ వేయలేదు. దాంతో అతగాడికి ఉక్రోషం వచ్చింది.

"ఎవడినా? దాని రంకుమొగుడిని. నా డబ్బు తిన్నంత కాలం అది నా సొత్తురా" అన్నాడు అతడు. ఇప్పటికి అర్థమయింది రాములమ్మ పరిస్థితి.

"పో బాబూ! రేపు ప్రొద్దున రా" బ్రతిమాలింది వెంకన్నను రాములమ్మ.

"ఎందుకే వాడిని బతిమాల్తావు? మెడబట్టి గెంటక" పురమాయించాడు కొత్త మనిషి. వెంకన్నకు విపరీతమైన కోపం వచ్చింది. ఎగిరి ఆ కొత్త మనిషిని పొట్టలో తన్నాడు. తాగి ఉన్నాడేమో వెల్లకిలా నేలమీద పడిపోయాడు ఆ మనిషి.

"ఓలమ్మో! చచ్చిపోయాడే" అరిచింది రాములమ్మ.

"ఇక్కడ నీవు ఉంటే పెద్దగోల అవుతుంది వెళ్ళు బాబూ" అని వెంకన్న గడ్డంపట్టుకొని ప్రాధేయపడింది రాములమ్మ.

వెంకన్న వెళ్ళిపోయాడు.

కాని మరునాడు ఉదయం రాములమ్మ దగ్గరకు వచ్చాడు. మామూలుపద్ధతిలో రాములమ్మ వెంకన్నను ఆదరించింది. 'చా' నీళ్ళు ఇచ్చింది. దగ్గరకూర్చొని మాటలు మొదలెట్టింది.

"రోజా దగ్గరకు వెళ్ళి వచ్చావా?"

"లేదు"

అతని ముభావపు జవాబు చూచి బిత్తరపోయింది రాములమ్మ. అందువల్ల మౌనం వహించింది. "అక్కయ్యా" వెంకన్న రాములమ్మను పిలిచాడు. ఇలాంటి పిలుపు వినడం ఇదే మొదటిసారి ఆమెకు. ఆమె మనసు పురివిప్పి నాట్యం చేసింది. తన జన్మ ధన్యమైనట్లు భావించింది. ఒక రకంగా తన్మయావస్థలో ఉన్నట్లు చెప్పవచ్చు. మళ్ళీపిలిస్తే బాగుండునని తోస్తుంది తనకు.

"నీవు ఈ వృత్తి మానివెయ్యాలి" ఆజ్ఞాపించినట్లుగా అన్నాడు వెంకన్న.

ఈ మాటకు, చెప్పినరీతికి అదిరిపడ్డది రాములమ్మ.

ఎవరిచ్చారీ అధికారం ఇతనికి అని ప్రశ్నించుకుంది. తమ్ముడూ అని పిలుస్తూ తనే అతనికి ఈ అవకాశం కల్పించానని గుర్తుచేసుకుంది. సిగ్గుతో తల వంచుకుంది.

"వీలుకాదు తమ్ముడూ"

"ఎందుకని?" మళ్ళీ అదే రకపు కంఠధ్వని. విస్తుపోయింది రాములమ్మ.

"నేను ఎలాగూ చెడిపోయినదాన్ని. ఇపుడు బాగుపడదామన్నా పడనీయదు సంగం" అన్నది రాములమ్మ.

ఎందుకు పడనీయదు సమాజం? రాములమ్మ ఏం తప్పు చేసిందని ఆమెకు ఆ శిక్ష? దేవుడు దయగలవాడంటారే

అతడు రాములమ్మకు సహాయం చెయ్యడా? ఇలా ఆలోచించు కుంటూ మాట్లాడలేదు వెంకన్న.

"నేను బాగుపడ్తానంటే పోలీసులు, నన్ను కొనే మగాళ్ళు, చుట్టూఉన్న పెద్దమనుషులు ఊరుకోరుబాబూ. మా బోటి వాళ్ళకోసం జైళ్ళు నోళ్ళు తెరుచుకొని ఉంటాయి బాబూ!" విలపించింది రాములమ్మ.

"బా గు ప డా ల ని నీకేలేదు. చుట్టూ ఉన్నవాళ్ళను తిడుతున్నావు. అందుకని వాళ్ళందరూ నీకన్న మంచివాళ్ళు బాగా జీవిస్తున్న వాళ్ళూనూ" నిందించాడు వెంకన్న రాములమ్మను.

రాములమ్మ మామూలుగా నెమ్మదిమనిషి క్రిందలెక్క. ఈమాటతో రెచ్చిపోయింది.

"ఏందయ్యా నీ మాట. దొంగవ్యాపారం చేసే సేఠ్‌కు గిడ్డంగులలో సరకు చేర్చే హమాలీలు తమ చేతులను అమ్ము కోవటంలేదా? ఖూనీ చేసివచ్చి తనని రచ్చించమంటే వాడిఫీజు పైకానికాసపడి తిమ్మిరిబొమ్మిరిచేచి, తప్పుడువాదన చేసి కేసు కొట్టేయించేప్లీడరు మెదడు అమ్ముకోవడంలేదా? నల్లడబ్బును పర్తకులకు కాపాడి పెట్టేదానికి రెండురకాల లెక్కలు రాయించిపెట్టే ఆడిటర్లు వాళ్ళ బుర్ర అమ్ముకోవటం లేదా? పెజల్ని పీల్చుకుతినే పెద్ద ఫ్యాక్టరీవోళ్ళకు తెలివి తేటలను అమ్ముకున్న డిగ్రీలున్న మహారాజుల [illegible]

జనానికి అన్యాయం చేసే గవర్నమెంటుకు కాళ్ళు పిసికే పెద్ద పెద్ద అధికారుల సంగతేమిటయ్యా?

అందరూ తలోటి అమ్ముకుంటున్నారు - కాళ్ళూ, చేతులూ, మెదడూ, చదువూ తెలివితేటలు. నాలోటివాళ్ళు వళ్ళు అమ్ముకోవలసిన పరిస్థితిలో ఉంటే మమ్మల్ని 'చెడిపోయినోళ్ళు' అని పిలుస్తారు అమ్ముడుపోయే ఈ పెద్ద మనుష్యులంతా.

ఇందులోనూ మరో అన్యాయం. మా మీద కేసులూ' మాకు శిచ్చలూ. పైసలు పారేసి మా దగ్గరకు వచ్చే మగాళ్ళ మీద కేసులు లేవు.

బాబూ! ఇక సెప్పు ఎవరిదితప్పో?''

రాములమ్మ ఇంత ఘాటుగా మాట్లాడంగా వెంకన్న ఎప్పుడూ వినలేదు.

"అక్కా! నన్ను క్షమించు అక్కా. నిన్ను అనవసరంగా తిట్టాను'' ముఖంమీద చేతులు పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు వెంకన్న.

రాములమ్మ అతనితల నిమిరింది.

వెంకన్న లేచి కూలికోసం వెళ్ళాడు.

# 15

రాములమ్మతో మాట్లాడి వచ్చిన తరువాత వెంకన్న మనసు వికలమయింది. తాత దగ్గర పెరిగినపుడు మనస్సులో రెండు ఆలోచనలు లేవు. తాత చెప్పిందే వేదం. సుందరరామయ్యగారింట్లోనూ అలాగే ఉండేది. ధర్మమేదో ఆయన వివరంగా చెప్పేవాడు. సందేహం ఉండేదికాదు మనస్సుకు. ఇపుడు అన్నీ సందేహాలే.

రోజా జ్ఞాపకానికొచ్చింది. రోజాదగ్గరకు వెళ్ళాలంటే డబ్బుకావాలి. బాగా సంపాదించాలి. ఉస్మాన్ గంజికి వెళ్ళాడు వెంకన్న. అక్కడ హమాలీల ముఠాలున్నాయి. అందులో సూరయ్యదోముఠా. సూరయ్య దగ్గరకెళ్ళి ముఠాకూలీగా చేర్చుకోవలసిందని వెంకన్న ప్రాధేయపడ్డాడు.

'తన ముఠాలో ఇద్దరు ముగ్గురూ ముసలాళ్ళయినారు. బళ్ళు లాగలేకపోతున్నారు. వెంకన్న జబ్బలు ఏపుగా పెరిగి పటిష్టంగా ఉన్నాయి; పైగా కుర్రాడు అందంగా ఆకర్షణీయంగా ఉన్నాడు' ముఠాలో చేర్చుకున్నాడు సూరయ్య.

వెంకన్నకు రోజుకు రెండుమూడు రూపాయలు దొరుకుతున్నాయి. ముందుగా రాజవ్వబాకీ పూర్తిగా తీర్చాడు. వద్దన్నా వినకుండా రాములమ్మ ఎప్పుడో ఇచ్చిన పైసలు ఆమెకు ఇచ్చాడు. ఇప్పుడు తను ఎవరికీ ఏమీ

బాకీలేడు. రెండుపాంట్లూ, రెండు చొక్కాలు మంచివి కుట్టించు కున్నాడు. రెండు కాకీనిక్కర్లూ, రెండు బనీనులూ ఏర్పరిచు కున్నాడు. వాటిని పని చేసేటప్పుడు వాడుతున్నాడు. తలకు నూనె రాయడం మొదలుపెట్టాడు. ఒకచిన్న అద్దం, దువ్వెనా సంతరించుకున్నాడు. ఒక చిన్నగది నెలకు 10 రూపాయలకు అద్దెకు తీసుకున్నాడు. పని పూర్తి చేసుకొని గుడ్డలు మార్చుకొని అటు పార్కుకో ఇటు టాంకుబండుకో పోవటం అలవాటు చేసుకున్నాడు.

చాకిరి ఎక్కువగానే ఉంది. బండచాకిరీ క్రిందలెక్క. రెక్కలు ముక్కలు చేసుకోవలసిందే. కండలు కరిగిపోతాయి. నూనెడబ్బాలు, బియ్యపుబస్తాలు, పప్పుబస్తాలు, కిరసనాయిలు డ్రమ్ములు, టెంకాయగోతాలు, సిమెంటుబస్తాలు ఇవీ అవీ ఏమిటి అన్నిరకాల వస్తువులూ మోయవలసిందే. అయితే రాత్రిఎనిమిదిగంటలకు లెక్కచూస్తే రోజుకు ఎన్నడూ చూడ నంత డబ్బు వస్తున్నది. రోజా అంతస్తుకు తను రావటానికి శ్రమపడాలి కనుక వెంకన్న కష్టపడుతున్నాడు.

ఆ రోజు ఆదివారం మార్కెట్టులేదు. సింగారించుకొని రోజా గుర్తు చెప్పిన ఇంటికి వెళ్ళాడు. వాకిట్లో నుంచోని "రోజా ఉన్నదా" అని కేకేశాడు. పద్దెన్మిదేళ్ళ అమ్మాయి బయటికి వచ్చింది. ఆమే రోజా. రెప్పలార్పకుండా చూస్తున్నాడు వెంకన్న. అడుగు ముందుకు వెయ్యకుండా

అక్కడే స్థాణువులా నుంచున్నాడు. ఇంతలో మరొక అమ్మాయి బయటికి వచ్చింది. ఆమె రంప్యారీ - రంగడి స్నేహితురాలు. ఆమే వెంకన్నను గుర్తు పట్టింది.

"మా రంగడుగారి స్నేహితులుకదూ! మా ఇంటికి రావటానికి ఇన్నాళ్ళు పట్టిందా" మాట సాగదీసింది రాంప్యారీ.

ఏం చెప్పాలో తోచక సిగ్గుపడ్డాడు వెంకన్న.

"లోపలికి రండి. అమ్మాయ్ వారికి కాఫీ ఇవ్వు" పురమాయించి-వెళ్ళిపోయింది రాంప్యారీ.

వెంకన్న మెట్లెక్కి వరండలో కూర్చున్నాడు. కాఫీ తెచ్చి ఇచ్చింది రోజా.

మాటలు ఎలా ప్రారంభించాలో తెలియలా వెంకన్నకు. "బాగున్నారా?" కుశలప్రశ్నాదికం చేశాడు వెంకన్న.

కిలకిలా నవ్వింది రోజా.

"అలా నవ్వుతావేం?"

"నవ్వక ఏం చేస్తాను. ఎంచక్కా ఉన్న నన్ను బాగున్నావా అంటే" మళ్ళీ నవ్వింది రోజా.

ఆమె బుగ్గలు సొట్టపడ్డాయి. దాంతో ఆమె అందం ఇనుమడించింది. ఆదేపనిగా వాటివంక చూస్తున్నాడు వెంకన్న.

"అబ్బ! అంత ఇదిగా చూస్తే సిగ్గు వేస్తుంది" అనగల్గింది రోజా.

"రోజా! . . . . ."

"చెప్పండి! ఆగిపోయారేం" రెచ్చగొట్టింది రోజా.

"మరే. మరేంలేదు. మ్యాటినీకి ఇంగ్లీషు సినిమాకు వెళ్దాం" ధైర్యంచేసి ఒక్క గుక్కలో అనేశాడు వెంకన్న.

"ఓస్. ఇంతేనా. ఇంకెంతో పెద్దకోర్కె తీర్చమని అడుగుతారని భయపడ్డాను" రోజా వ్యంగ్యంగా పలికింది.

"అక్కయ్యతో చెప్పి వస్తాను" అనిచెప్పి లోపలికి వెళ్ళింది.

ఇంకొక అయిదునిమిషాలలో ముస్తాబయి తిరిగి వరండాలోకి వచ్చింది.

ఇద్దరూ ఇంగ్లీషు సినిమాకు వెళ్ళారు. ఆరోజు వెంకన్న రిజర్వ్డు బాక్సు టిక్కెట్లు కొన్నాడు. ఆమెకూ, తనకూ ఐస్క్రీం కొన్నాడు. ఆమెకు చాక్లెట్లు కొన్నాడు. తను పిప్పరమెంట్లు కొనుక్కున్నాడు.

సినిమా మొదలయింది. న్యూస్‌రీలు, వర్తక ప్రకటనలూ అయిపోయాయి. అసలు సినిమా మొదలయింది. కథానాయకుడూ, కథానాయకి ఒకరిచేయి మరొకరు పట్టుకొని పార్కులో నడుస్తున్నారు.

వెంకన్న రోజా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఆమె అతని వైపు చూచింది. తన చేతి మునిగోళ్ళతో అతని అరచేతిని నొక్కింది.

కాథానాయికుడు కథానాయకిని హృదయానికిహత్తుకొని ముద్దుపెట్టుకున్నాడు. వెంకన్న చేయి రోజా తొడమీద వాలింది. ఆమె చెయ్యి అతని మెడచుట్టూ తిరిగింది.

మరోఘట్టంలో కథానాయకుడు కథానాయకి చాపచుట్టగా దొర్లుతున్నారు ఒకరి నొకరు పెనవేసుకొని.

రోజా చటుక్కున వెంకన్న పెదాలమీద తన పెదాలుంచి ముద్దాడింది.

చకితుడయినాడు వెంకన్న.

కథ జరుగుతున్నది.

కథానాయకుడు ఎక్కడికో వెళ్ళిపోతున్నాడు.

కథానాయకి వీడ్కోలు ఇస్తున్నది ముద్దులతో.

వెంకన్న రోజాను వాటేసుకొని ముద్దులవర్షం కురిపించాడు.

సినిమా అయిపోయింది.

ఇద్దరూ పబ్లిక్ గార్డెన్సు పార్కుకు వెళ్ళారు.

పదినిమిషాలు ఇద్దరిమధ్యా మౌనం ఆవరించింది. ఒకరి అందాన్ని మరొకరు తనివితీరా తాగేస్తున్నారు. క్రీగంట చూసుకుంటున్నారు.

మధ్యమధ్య సిగ్గుపడి మొగాలు త్రిప్పుకుంటున్నారు.

"నా పేరు వెంకన్న"

"తెలుసు" అంది ఆమె

"ఎలా తెలుసు?"

"మా అక్క రంగడిద్వారా తెలుసుకుంది"

"నా పేరు రోజా"

"తెలుసు"

"ఎవరుచెప్పారు? నేను మీకు చెప్పలేదే?"

"రంగడు చెప్పాడు"

ఇలా అనవసర సంభాషణ సాగుతున్నది. ఇద్దరి మనస్సుల్లో ఏవేవో ఉన్నాయి. ఆ భావాలు బయటికి రావటానికి ఈ ఉపోద్ఘాతం.

'నీవంటే, నీవంటే . . . ."

"నాకు చాల ఇష్టం" పూర్తి చేసింది రోజా

"ఏమిటి ఇష్టం?" ప్రశ్నించాడు వెంకన్న

"నీవ్వంటే" కిలకిలా నవ్వింది రోజా.

ఆమె పేరుకు తగ్గట్టు ఆమె బుగ్గలు రోజారంగులో ఉన్నాయి. అది పెట్టుడు రంగుకాదు. సహజచ్ఛాయ అది. ఆమె అతిలోక సౌందర్యాన్ని తిలకిస్తూ ఉన్నాడు వెంకన్న.

"ఏమిటిబాబూ ఆ చూపులు. బుగ్గలను నమిలి మింగేస్తున్నారు" అందిరోజా.

వెంకన్న ఆమె బుగ్గలమీద ముద్దులవర్షం కురిపించాడు.

"అక్కా ఎదురుచూస్తుంటుంది. వెళ్ళాలి" లేచింది రోజా.

ఇద్దరూ ఆమె ఇంటికి ఆటోలో వెళ్ళారు. ఆమెను దిగబెట్టి ఇంటికి వచ్చాడు వెంకన్న. ఆ రోజు అతనికి 10 రూపాయలు ఖర్చు అయింది. అయితేనేం. స్వర్గలోకపు అంచులదాకా వెళ్ళాడతను.

# 16

తరువాతి ఆదివారం ప్రొద్దున్నే రాములమ్మ ఇంటికి వెళ్ళాడు వెంకన్న 'అక్కా' అని పిలుస్తూ'. తమ్ముడిని ఎగాదిగా చూచుకుంది. వెంకన్నలో వచ్చిన మార్పును గమనించింది. తాతవెంబడి కాళ్ళీడ్చుకుంటూ తిరిగే కుర్రాడు కాడతను. కండలు మెలితిరిగిన దేహం; వెడల్పయిన ఛాతీ, ఉంగరాలజుట్టు, చంపకు చారెడేసికళ్ళు. తమ్ముడు కాబట్టి

పరిపోయింది కాని ఇంకొకళ్ళయితే ఎగిరి ముద్దెట్టుకునేదాన్ని కదా అని అనుకుంది.

"ఏమిటి అక్కా అలా చూస్తున్నావు?" అడిగాడు వెంకన్న.

"నీలో వచ్చిన మార్పునయ్యా"

"ఓస్ అదా!" నవ్వేశాడు వెంకన్న.

రోజాకూ తనకూ జట్టు కలసిన విధం చెప్పాడు వెంకన్న.

ఆమె సంతోషిస్తుందని ఆశించాడు అతడు. కాని ఆమె నొసలు ముడివడ్డాయి.

"తమ్ముడూ . . . . ."

"చెప్పదలచుకున్నది చెప్పేశయి అక్కా" తొందర పెట్టాడు వెంకన్న.

"రోజాతో జట్టు వద్దురా తమ్ముడూ" వీపుమీద చెన్నాకోలుతో కొట్టినట్లయింది వెంకన్నకు.

రాములమ్మ అసూయకు లోనయిందా అనేఅనుమానం వచ్చింది అతడికి. ఆమె ముఖం చూచాడు. నిర్మలంగాఉంది ఆమె వదనం. నిష్కల్మషం ఆమె హృదయం అని తేలింది అతనికి.

"అక్కా!" ఆక్రోశించాడు వెంకన్న

"ఏం చెప్పేదిరా తమ్ముడూ! రాంప్యారీ, రోజా, నేనూ ఒకేసారి పోలీసుస్టేషనలో ఉన్నాంరా. మాది ముగ్గురిదీ ఒకే జాతి"

అక్కడ ఉండలేక ముఖానికి పైటచెరగు అడ్డం పెట్టుకొని వెళ్ళిపోయింది ఇంట్లోకి రాములమ్మ.

మధ్యాహ్నం రెండింటికి రోజా ఇంటికి వెళ్ళాడు.

'అక్క చెప్పేది నిజమా? పొరపాటేమో! ఒకేపేరు ఉన్నవాళ్ళు ఇద్దరు ఉండకూడదా? అసంభవం. రోజా అలాంటి మనిషి కాదు. ఇందులో ఏదో తిరకాసు ఉంది' అనుకుంటూ వెంకన్న వరండాలోకి ప్రవేశించాడు.

కూల్ డ్రింకు తెచ్చి ఇచ్చింది రోజా; ఎదురుగా కూర్చుంది. వెంకన్న సంభాషణ ప్రారంభించాడు.

"మీ అక్క ఇంట్లోలేదా?"

"లేదు; రంగడుగారితో సినిమాకు పోయింది"

"నీకు పెండ్లయిందా?"

"ఏం? నన్ను పెండ్లి చేసుకుంటారా?"

"నీవు ఒప్పుకుంటే . . . . ."

"ఒప్పుకోకపోతే"

"ఒప్పుకుంటావు"

"అమ్మా ఆశే"

"నిన్ను చూస్తే ఎవరికైనా ఆశపుడుతుంది"

"మీకు కూడానా"

"ఏం? నేను మనిషిని కానా"

"కాదంటే మాత్రం ఊరుకుంటారా"

"ఊరుకోక ఏం చేస్తాను అమదమూరాన కూర్చుంటే" రోజా వెంకన్న ప్రక్క కుర్చీలోకి చేరింది.

వెంకన్న ఆమె మెడ చుట్టూ తన చేయివేసి ఆమెను దగ్గరకు లాక్కొని ముద్దుపెట్టుకున్నాడు.

"ఏమిటీ దౌర్జన్యం?"

"పెండ్లికి అంగీకరింప చేయాలికదా?"

రోజా కిలకిలా నవ్వింది.

ఆ నవ్వు అతనిని రెచ్చగొట్టింది.

ఆమె చేయిపట్టుకొని లేపి ఆమెను ఇంట్లోకి తీసుకొని పోతున్నాడు వెంకన్న.

"ఆగండి. మనిద్దరికీ పెండ్లి కాలేదుగా ఇంకా" అంది రోజా.

'అవును. పెండ్లి కాలేదు. తనెంత ధూర్తంగా ప్రవర్తించాడు. రోజా తనను గురించి ఏమనుకుంటుందో. చవకబారు మనిషి ననుకుంటుందేమో!'

"సారీ! . . ." రోజా చెయ్యి వదిలాడు వెంకన్న.

ఆమెకు అతని పై జాలివేసింది.

అతని భుజంమీద తలవాల్చి అతనిని నడిపించుకుంటూ మళ్ళీ వరండాలోకి వచ్చింది రోజా.

వెలవెల బోతున్నది వెంకన్న ముఖం.

అతనిని కుర్చీలో కూర్చొండబెట్టి ప్రక్క కుర్చీలో తను ఆసీనురాలయింది రోజా.

"ఎందుకు అలా అయిపోయారు. మీరేం తప్పు చేయలేదే! నేను మీ దాన్ని" రోజా వెంకన్నకు ధైర్యం చెప్పింది..

"ఇంకా మనిద్దరి వివాహం జరగలేదుగా"

"పెండ్లి జరిగినా జరగకపోయినా మీరే నా సర్వస్వం."

రోజా మాటలు విన్న వెంకన్న ముఖం వికసించింది. మనస్సులో ఉన్న దోషభావం పటాపంచలయింది.

మరి రోజా అలా ఎందుకు ప్రవర్తించినట్లు?

ఆ ప్రశ్న అలాగే మిగిలిపోయింది.

"మరి . . . ." అతని గొంతులో అంతకన్నా మాట పెగల్లేదు.

"అదా! నేను మీకు తగను. అంతే"

"ఆ విషయం తేల్చాల్సింది నేను"

"నాకూ సగం అధికారం ఉంది"

"నీ ఆధికారం రద్దుచేశాను"

"పెండ్లి అయిన తర్వాత కదా ఆ శాసనాలు"

"ఇంతకూ . . . ."

"నన్ను బలవంతాన కొంతమంది దుర్మార్గులు వృత్తిలోకి దింపారు"

షాక్ తిన్నాడు వెంకన్న.

రాములమ్మ చెప్పింది నిజమయి ఉంటుంది. ఇక ఆ విషయం తర్జన భర్జన అనవసరం.

"నేను నిన్ను ప్రేమించాను"

"తెలుసు"

"మరి . . . . ."

"నాకూ . . . . . ."

"నువ్వంటే ఇష్టం" అంతేగా అన్నాడు వెంకన్న. తలూపింది రోజా.

"మన పెళ్ళి ఎప్పుడు? . . . ." వెంకన్న ప్రశ్న.

"జరగదు"

దిగ్భ్రాంతి చెందాడు వెంకన్న.

"జరగటానికి వీల్లేదు" రోజా పల్కింది.

"ఏం ఎందుచేత?" సహనం కోల్పోతున్నాడు వెంకన్న.

"నా శరీరం మోడివంటు కనుక" సమాధిలో ఉన్న మనిషి పల్కినట్లున్నాయా ఈ మాటలు.

"వైద్యం చేయించుకుందాం"

"అసంభవం. చేయిదాటి పోయింది"

రోజా నిజం చెప్తున్నదా? లేక తనను ఉడికిస్తున్నదా? లేక తన ప్రేమను పరీక్షిస్తున్నదా? ఏదీ తేలలేదు వెంకన్నకు. అమాంతంగా కుర్చీలోనుంచి లేచి ఆమెను వాటేసుకున్నాడు. విదిలించుకుందామె.

"మీరీ ఇంట్లో ఇక ఉండతగరు. వెళ్ళండి" అని కేక వేసి గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది రోజా.

వెంకన్న విచారంగా ఇంటిముఖం పట్టాడు.

కొంతదూరం నడిచిన తరువాత రాములమ్మను చూద్దామనిపించింది.

రాములమ్మ ఇంటికి చేరాడు.

"ఈ దేశం నాదేనా!"

"అక్కా! నీవు చెప్పింది వాస్తవమే అక్కా!"
వెంకన్న కంఠం రుద్ధమయింది

తమ్ముడిని కావలించుకొని ఏడ్చింది.

"తమ్ముడూ! నీ బతుకు బండలయిందిరా"
ఆక్రోశించింది రాములమ్మ.

"రోజా . . . ."

"నాకు తెలుసురా. ఆ అమ్మాయి మనసు నవనీతంరా.
ఏం లాభం నీకుకాకపోయిన తరువాత . . . ."

"అక్కా! బురదలో కమలం పుట్టటం లేదా?"

"తమ్ముడూ! బురదలో పుట్టిన కమలాన్ని మళ్ళీ
బురదలోకి త్రొక్కారురా"

వెంకన్న మూర్ఛ పోయాడు.

"ముఖాన చన్నీళ్ళుచల్లి లేపింది రాములమ్మ.

'టీ' నీళ్ళు ఇచ్చి సేద తేర్చింది.

"వెళ్తాను అక్కా నా రోజా . . . . . . ." అంటూ
వెంకన్న తన గదికి వెళ్ళిపోయాడు.

## 17

నగరంలో కిరసనాయిలు దొరకటంలేదు. గ్యాసు
సిలెండరులసప్లయి ఆగిపోయింది విశాఖపట్నంలో సమ్మెవల్ల.



"ఈ దేశం నాదేనా?"

[illegible]లూ, మధ్యతరగతివాళ్ళూ, బీదాబిక్కీ అందరూ కిరసనాయిలుకోసం ఎగబడ్డారు. చవక దుకాణాల్లో స్టాకు లేదనే బోర్డులు వెలిశాయి. కట్టెలడిపోలు ఖాళీలయినాయి. చెత్తచెదారం - పొయ్యి క్రిందికి ఏది దొరికితే దాన్ని వాడుతున్నారు జనం. శాసన సభలో తీవ్రమైన చర్చ జరిగింది. సత్వర చర్యలు తీసుకుంటామని హామీ ఇచ్చారు మంత్రులు. తీక్షణ దృష్టి సారించారు అధికారులు. కాని కిరసనాయిలు జాడ తెలియటంలేదు.

ఈ పరిస్థితి రాకముందు వారం రోజుల క్రిందట సేఠ్ చబిల్‌దాస్ గిడ్డంగికి సూరయ్యముఠా వంద బండ్ల కిరసనాయిలు డబ్బాలు తోలింది. తరువాత సూరయ్యముఠా ఆ సరకును మరెచ్చటికీ కదిలించలేదు. సూరయ్యముఠాను తప్ప మరే ముఠాను పిలవడు ఆ సేఠ్‌జీ.

కిరసనాయిలు కొరత విషయం చర్చకు పెట్టాడు వెంకన్న తన ముఠా సమావేశంలో. అందరూ కటకటపడ్డారు. సేఠ్‌జీని పట్టిద్దామన్నాడు వెంకన్న. తతిమ్మావారు ససేమిరా అంగీకరించలేదు. ఇరవయి ఏండ్లనుంచీ ఖాతా ఉన్న సేఠ్‌జీని పట్టివ్వడం జరగదన్నారు.

వెంకన్న దిగులుతో ఇంటికి వచ్చాడు.

మరునాడు వెంకన్న పనికి పోలేదు.

ఉదయం పది కొండు గంటలకు సరాసరి సివిల్ సప్లయిస్ కమీషనర్ ఆఫీసుకు వెళ్ళాడు. తనకు ఉన్న వాటిలో మంచి దుస్తులు వేసుకున్నాడు. ధనవంతుల బిడ్డడవే భ్రమ కలిగిస్తున్నది ఆ డ్రెస్.

సివిల్ సప్లయిస్ కమీషనరును చూడాలన్నాడు. అసలు విషయమేమిటో చెప్పమని అసిస్టెంటు సప్లయి కమీషనరు, డిప్యూటీ కమీషనరు కోరారు. అది పెద్ద ఆఫీసరుకే చెప్తానన్నాడు. దేనిసంబంధమో కనీసం చెప్పమని కోరారు. కిరసనాయిలు సంబంధమనగానే వారు అతనిని వెంటనే పై ఆఫీసరు గదిలోకి స్వయంగా తీసుకెళ్ళారు. రహస్యంగా మాట్లాడవలసి ఉన్నదనగానే తతిమ్మా ఆఫీసర్లవైపు చూచాడు కమీషనరు. వారు వెళ్ళిపోయారు. కమీషనరూ, వెంకన్నా మిగిలారు. సేఠ్ జీ వద్ద వందబండ్ల కిరసనాయిలు ఉందని వెంకన్న చెప్పాడు.

కమీషనరు క్రింది ఆఫీసర్లను పిలిచి దాడికి సన్నాహాలు చెయ్యమన్నాడు. దాడికి పోతున్నారు కాని ఎక్కడికి పోతున్నారో ఎవరికీ తెలియదు. కమీషనరు కారులో కమీషనరూ, వెంకన్నా తప్ప మరెవ్వరూ లేరు తతిమ్మాకార్లు, వ్యాన్లు, సిబ్బందీ, మోటారుసైకిళ్ళపైనున్న ఇనస్పెక్టర్లూ అందరూ కమీషనరు కారు వెంబడి రావాలని కమీషనరు ఉత్తరువు. అలాగే సాగింది జైత్ర యాత్ర.

కమీషనరు కారుసేఠ్ చబీల్ దాస్ గిడ్డంగి దగ్గరచేరింది. మధ్యవర్తుల ఎదుట తలుపులు బద్దలుకొట్టి కిరసనాయిలు డబ్బాలన్నింటినీ స్వాధీనం చేసుకున్నారు. వార్తాపత్రికలకీవార్త ఇచ్చారు. మరునాడు పత్రికలలో కమీషనరుగారి దాడివివరాలు పడ్డాయి. వెంకన్న ఫోటో పడింది. అతనిపై రెండుమూడు దిన పత్రికలు ప్రశంసావాక్యాలు రాశాయి.

ఆ సాయంత్రానికి చవకదుకాణాలకు కిరసనాయిలు సప్లయి జరిగింది. ప్రజలకు గ్యాసునూనె దొరికింది.

సేఠ్ జీని అరెస్టు చేశారు. జామీనుమీద విడుదల చేశారు. [illegible]

వెంకన్నను సూరయ్యముఠా తమలోనుంచి తీసివేసింది.

వెంకన్న తిరిగి నిరుద్యోగి అయ్యాడు. పరిస్థితి మారి మళ్ళీ మొదటిదశకు వచ్చింది.

## 18

వెంకన్నకు ప్రపంచం అంటే ఏమిటో ఇపుడు అర్థం అవుతోంది. అతని జిజ్ఞాస పెరుగుతోంది. సమాజానికీ, ప్రజలకూ ప్రభుత్వానికీ ఉండే సంబంధాన్ని అవగతం చేసుకోవాలనే కోరిక బలీయమవుతోంది. తన జీవితంలో కొంతకాలం అందుకోసం వినియోగించుకోవాలనుకున్నాడు.

తన సంపాదనలో మిగిలిన వందరూపాయలతో కొన్నాళ్ళు పొట్టపోసుకుంటూ నిజమైన విద్య గడించాలనుకున్నాడు.

తను ఉంటున్న గది ఖాళీచేశాడు. నెలకు 5 రూపాయల అద్దెకు దొరికిన చిన్న గదిలో చేరాడు. తెలుగుపత్రిక కొనడం మొదలుపెట్టాడు. నగరంలో జరిగే మీటింగులకు వెళ్ళడం అలవర్చుకున్నాడు. ముందు వరుసలో కూర్చుని ప్రతి మీటింగులో ఉపన్యాసాలను శ్రద్ధగా ఆసక్తిగా వినేవాడు.

ప్రతిరోజూ పత్రికలో విషయాలు బస్తీ ప్రజలకు తెలియచెప్పేవాడు. తను విన్న ఉపన్యాసాల సారాన్ని వారికి ఎరుకపరిచేవాడు. వాటిమీద వ్యాఖ్యానాలు చేసేవాడు. వెంకన్న ఏర్పాటుచేసే రాత్రి రచ్చబండ మీటింగులకు బస్తీలో ఎక్కువ మంది రావటం మొదలుపెట్టారు. అతడంటే బస్తీ ప్రజలకు గౌరవాభిమానాలు పెరిగాయి. సోమయ్య వచ్చి వెంకన్నను అభినందించాడు. అతనిని ఇంట్లోనుంచి వెళ్ళమన్నందుకు పశ్చాత్తాపం వెలిబుచ్చాడు.

బస్తీలో బడిలేదు. తల్లిదండ్రులు పనిపాటలకుపోతే ఇంటిదగ్గర ఉండే పిల్లలకు మధ్యాహ్నం చదువు చెప్పడం సాగించాడు. పిల్లలు "బాబాయి" అంటూ అతని చుట్టూ మూగేవారు.

రాత్రి ఒక గంట పెద్దలకు ప్రయోజనవిద్యా పాఠశాల నడపటం అవసరంగా తోచింది వెంకన్నకు. బస్తీ పెద్దలతో

ఈ విషయం ప్రస్తావించాడు. వారు సంతోషంగా అంగీకరించారు. ఒక అరగంట అక్షరాలుదిద్దటం, వ్రాయటం, లెక్కలు నేర్పేవాడు. మిగతా అరగంట లోక వ్యవహారాలపై తను మాట్లాడేవాడు. తరువాత కొన్నిరోజులకు పద్ధతి మార్చాడు. తనుమాట్లాడకుండా ఇతరులచేత మాట్లాడించేవాడు. దాంతో ఊహలుండికూడా మూగ జీవాలుగా ఉంటున్న జనం తమ భావాలకు రూపకల్పన చేయడం జరిగింది. ప్రతి ఒక్కరూ తమ అనుభవాలను అభిప్రాయాలను తదితరులకు చెప్పేవారు. దాంతో అందరి స్థాయి పెరగడం ఆరంభించింది.

సమాజంలో అస్థి ఎలా పుట్టింది?, దేవుడున్నాడా లేదా? [illegible] ఎవరెవరు [illegible]దాయకలు?, జాతర్లు చెయ్యడంవల్ల లాభమేమిటి?, అందరికీ ఎందుకు పని దొరకటం లేదు?, ఒకవేళ దొరికినా పనికితగ్గ ప్రతిఫలం ఎందుకు లభించటంలేదు, సమాజంలో సోమరిపోతులకు భోగభాగ్యాలెందుకు అందుబాటులో ఉన్నాయి? ఇలా ఎన్నో సమస్యలమీద చర్చలు సాగేవి. ఒక్కొక్కప్పుడు ఉద్రేకాలు పెరిగేవి-చేతులు కలుస్తాయా అనే భయం కూడా కల్గేది. కాని వెంకన్న కృషివల్ల బస్తీ ప్రజలలో వచ్చిన సుహృద్భావం, ఐకమత్యం కొట్లాటను రాకుండా చేసేవి

ఒకరోజున బస్తీలో ఉన్న ఆడవాళ్ళు వెంకన్న దగ్గరకు వచ్చారు. తమకు కూడా పాఠాలు చెప్పవలసిందని

కోరారు. వెంకన్న బస్తీ పెద్దలను అడిగి ఏ విషయం చెప్తానన్నాడు. ఆ రోజు రాత్రి ఈ అంశాన్ని బస్తీ ప్రజల సమావేశంలో సొచ్చరించాడు. కొంతమంది మగాళ్ళు వ్యతిరేకించారు. బస్తీలోనుంచి బయటబడికి వెళ్ళే విద్యార్థినులు ఒకరిద్దరూ గట్టిగా స్త్రీల కోర్కెను బలపరిచారు. బస్తీ పెద్దలు కాదనలేక పోయారు. సోమయ్య భార్య అందరికన్నా ముందుగా తన పేరు ఇచ్చింది. ఇరవై మంది చేరారు చదువు కోసం వయోజన పాఠశాలలో. బస్తీలో తాగుడు తగ్గింది. పెళ్ళాలను కొట్టటం ఆగింది.

చిన్నపిల్లలు దగ్గరనుంచి పెద్దవాళ్ళదాకా అందరికీ తలలో నాలికయినాడు. మధ్యాహ్నం భోజనం రాములమ్మ ఇంట్లో తినేవాడు సాయంత్రం రాజవ్వ బువ్వతో తృప్తి పడేవాడు. బస్తీ పెద్దలు అతనికి జీతం ఇస్తామంటే ససేమిరా వద్దని తీసుకోలేదు. ఆ అయిదురూపాయలగది కూడా ఖాళీ చేశాడు రామాలయంలో పడుకునేవాడు. ఖర్చులు బాగా తగ్గించుకున్నాడు. ఖర్చు పెంచే అలవాట్లను మానేశాడు. గ్రంథాలయాలకు వెళ్ళి చదవడం ఎక్కువయింది. ఇలా వెంకన్న బాగా ఎదిగాడు.

కిరసనాయిలు దాచిపెట్టిన సేఠ్‌చబీల్‌దాస్‌పై కేసు జరుగుతున్నది. దాని విషయం ప్రజలు మరచిపోయారు.

కిరసనాయిలు పట్టుకున్న సిపిలు సస్పెండయ్యారు కమిషన్ రద్దు
ప్రభుత్వం మరో శాఖకు బదిలీ చేసిందట. కేసును రుజువు
చేయటంలో ప్రభుత్వం విఫలమయ్యిందని పబ్లిక్ ప్రాసిక్యూటరు
కోర్టులో బహిరంగంగా అంగీకరించారట. షేక్ జీమీద కేసును
కొట్టివేసింది కోర్టు ఈ వార్త పత్రికలలో పెద్ద అక్షరాలతో,
హెడ్డింగులతో పడకుండా షేక్ జాగ్రత్తపడ్డాడు.

కేసు కొట్టేసిన మర్నాడు షేక్ తన స్నేహితులకు
పెద్ద విందు ఇచ్చాడు. తనదగ్గర పనిచేసే ఉద్యోగులకు ఒక్క
నెలరోజులజీతం ఉచితంగా ఇచ్చాడు. సూరయ్యను పిలిచి
[illegible] ఒకనెల బట్వాడా బోనస్‌గా
[illegible]

"సూరయ్యా! ఆ వెంకన్న ఇంకా ఈ ఊళ్ళోనే
ఉన్నాడా? వాడికొక కత్తిరించేవని ఎవరైనా చెయ్యొద్దా?"
భావస్ఫోరకంగా మాట్లాడాడు షేక్.

విషయం గ్రహించాడు సూరయ్య.

సాయంత్రం ఆరుగంటలకు చౌరస్తా దగ్గరనున్న
గ్రంథాలయంనుండి బస్తీకి వెళ్ళుతున్నాడు వెంకన్న. ముఖాల
మీద ముసుగులు వేసుకొన్న నల్గురు దృఢకాయులు
'వేసేయరా' అని ఒకరినొకరు హెచ్చరించుకుంటూ కర్రలతో
వెంకన్న వీపుమీద, తలమీద దబదబా కొట్టారు. వెంకన్న

పడిపోయాడు. చనిపోయాడని తలచి పారిపోయారు వారు. ఇదంతా త్రుటిలో జరిగిపోయింది. రోడ్డుమీద ఉన్న ప్రజలంతా నిశ్చేష్టులయ్యారు. స్పృహతప్పి పడిపోయిన వెంకన్న ముఖంమీద చన్నీళ్ళు చల్లారు అచ్చటి ప్రజలు. ఇంతలో అక్కడికి వచ్చాడు కోటయ్య. అతడు సైకిలు షాపునుండి ఇంటికి వెళ్తున్నాడు. చూచాడు వెంకన్నను.

అప్పుడప్పుడే వెంకన్నకు స్పృహవస్తున్నది. మెల్లగా లేవదీసి కూర్చోపెట్టారు వెంకన్నను. రిక్షాపిలిపించి కోటయ్యను తోడు ఇచ్చి దగ్గరలో ఉన్న డాక్టరుదగ్గరికి తీసుకొనివెళ్ళారు ప్రజలు. తలమీద రెండు పెద్ద దెబ్బలు తగిలాయి. నెత్తురు కారుతున్నది. చేతులమీద వీపుమీద కర్రదెబ్బలు కదుములు ఉన్నాయి. కట్లుకట్టి, సూదిమందిచ్చి సాగనంపాడు డాక్టరు.

కోటయ్య వెంకనన్ను బస్తీకి తెచ్చాడు. కొట్టినవాళ్ళు ఎవరని గుచ్చిగుచ్చి అడిగారు బస్తీవాసులు. తెలియదన్నాడు వెంకన్న. ఆ రోజుకుపాఠం వాయిదావేయమన్నారు ప్రజలు. కాదు సాగాల్సిందేనని పట్టుపట్టాడు వెంకన్న. సరే రాత్రి తొమ్మిదిగంటలకు వస్తామని వెళ్ళిపోయారు చూడవచ్చినవారు.

ఎంత ముసుగులు వేసుకున్నా వారి గొంతులనుబట్టి తనను కొట్టినవాళ్ళను గుర్తుపట్టగలిగాడు వెంకన్న. కాని వారి పేర్లను బయటపెట్టటం ఇష్టంలేదు అతనికి. వారి అజ్ఞానానికి, అమాయకత్వానికి నవ్వుకున్నాడు.

"దేశం అంటే ఏమిటి?" అనే విషయంపై ఆ రాత్రి వెంకన్న ప్రసంగించాడు.

# 19

ఆ రోజు బ్రహ్మాండమైన ప్రదర్శన ఉంటుందని నగరం గోడలమీద కాగితాలు అంటించబడ్డాయి. మధ్యాహ్నం మూడుగంటలకు చార్మినార్ వద్ద ఊరేగింపు మొదలయి రాత్రి ఏడుగంటలకు సికింద్రాబాద్ స్టేషను చేరుతుందట. మరో ఊరేగింపు సనత్‌నగర్ దగ్గర బయలుదేరి అమీరు [illegible] సికింద్రాబాద్ చేరుతుందట. హిందూస్థాను [illegible] [illegible] ఈ ప్రాంతాలకు పని చెయ్యగల ప్రతి వానికి ప్రభుత్వం పని చూపించాలి. లేకపోతే జీవనభృతి ఇవ్వాలి అనేది డిమాండు. పిలుపు ఇచ్చిన సంస్థ పెద్ద పలుకుబడిగల సంస్థ కాదు. మామూలుగా ఆందోళనల్లో పాల్గొనే ప్రతిపక్షాల పేర్లు గోడనోటీసులలో లేవు. కార్మికుల్లో బలం ఉందని చెప్పే వామపక్షాల పేర్లు లేవు. ఇది చాలా చిన్న ప్రదర్శనగా ఉంటుందని పోలీసుల అంచనా; కనుక వెంటనే అనుమతి ఇచ్చారు. రూటు నిర్దేశించారు. చార్మినార్, మొజాంజాహి మార్కెట్, నాంపల్లి, బషీర్‌బాగ్, లిబర్టీ, ట్యాంకుబండు, మహాత్మాగాంధి రోడ్డు, పారడైస్, సరోజినీదేవి రోడ్డు ఇదీ రూటు.

మధ్యాహ్నం రెండున్నరకు చార్మినార్ వద్ద పదిబ్యానర్లు పట్టుకున్న కుర్రవాళ్ళుతప్ప మరెవ్వరూలేరు. మూడుగంటలకు మూడువందల మందితో ప్రదర్శన ప్రా రం భ మ యిం ది. ఆ రోజు ఆదివారం. చాల ఆఫీసులకు, దుకాణాలకు, ఇళ్ళ కష్టే కూలీలకు సెలవుదినం. బషీర్‌బాగ్‌కు చేరేటప్పటికి ఊరేగింపు బాగా పెరిగింది. ప్రదర్శన అగ్రభాగం బషీర్‌బాగ్‌లో ఉంటే చివరిభాగం మొజాంజాహిమార్కెటువద్ద ఉంది. ఎవరికి వారే తమంత తామే అనుకొని వచ్చి ఊరేగింపులో చేరారు.

అది ఒక బ్రహ్మాండమైన ప్రదర్శనగా రూపొందింది. స్త్రీలు పురుషులూ ఊరేగింపులో ఉన్నారు. స్త్రీలు ఒకచోట పురుషులొకచోటకాదు. ఎవరికి ఎక్కడ ఊరేగింపులో చోటు దొరికితే వారు అక్కడే చేరారు. యువకులూ యువతులూ ఉత్సాహంతో ముందుకు సాగిపోతున్నారు. నినాదాలశబ్దం మిన్నుముట్తోంది.

ఇది చూచి పోలీసుఆఫీసర్లు అదిరిపోయారు. సనత్ నగరునుండి వచ్చే ఊరేగింపును గురించి వైర్‌లెస్‌లో పోలీసు కమీషనరు ఎప్పటికప్పుడు వర్తమానం పొందుతున్నాడు. ఆ ప్రదర్శన చార్‌మీనార్ దానికన్న రెండింతలు పెద్దదట. దాంట్లో ఎక్కువగా శ్రామికజనం ఉన్నారట. ఈ రెండు ఊరేగింపులూ కలిస్తే జనప్రవాహం అదుపు తప్పుతుందని

భయపడ్డారు పోలీసు అధికారులు. ఏమీ పాలుపోవడంలేదు వారికి.

ఇంతలో లిబర్టీ వద్దకు ప్రదర్శన అగ్రభాగం చేరేటప్పటికి ఊరేగింపు వెంటనున్న పోలీసు బలగంపై రాళ్ళ వర్షం కురిసిందని వార్త. పోలీసులు లాఠీచార్జి ఆరంభించారు.

రంగడువాళ్ళ బస్తీ మొత్తం కదిలింది. రంగడూ కోటయ్యా, రాములమ్మా, వెంకన్నా, సోమయ్యా చివరకు రాజవ్వా అంతా ఊరేగింపులో చేరారు. కోటయ్యా, వెంకన్నా భుజం భుజం కలిపి వస్తున్నారు. వాళ్ళ బస్తీతరపున నినాదాలిచ్చే బాధ్యత కోటయ్యా వెంకన్నా తీసుకున్నారు.

లాఠీచార్జీ ఈ బస్తీవాళ్ళదాకా వచ్చింది. లాఠీదెబ్బలకు కోటయ్య, వెంకన్నలు పడిపోయారు. వెంకన్న తల పగిలింది. కోటయ్య అక్కడికక్కడే మరణించాడు. కోటయ్య దేహాన్ని సోమయ్య ఇంటికి చేర్చారు. వెంకన్నను రాములమ్మా రాజవ్వా కలసి మోసుకొని వచ్చారు. ప్రయివేటు ఆస్పత్రిలో చేర్చారు. ఈ వార్త విని రోజా పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆస్పత్రిలో అతని సేవాబాధ్యత ఆమె తీసుకుంది. రాములమ్మ ఆసుపత్రికీ ఇంటికీ తిరుగుతోంది. వెంకన్న స్పృహలో లేడు.

రంగడికి వంటినిండా గాయాలే కదుములే. పది కదుములూ పదిగాయాలూ తగిలి ఉంటాయి. అతని గాయాలకు కట్లు కట్టించి, తన రక్షణలో అట్టే పెట్టుకుంది రాంప్యారి.

వెంకన్న మెదడుకు సంబంధించిన ఆపరేషను మూడు దాకా చేశారు పెద్దడాక్టర్లు వాళ్ళెవరూ ఫీజులు తీసుకోలేదు. ఆస్పత్రి ఖర్చు లేకుండా చేశారు ఆ ప్రయివేటు ఆస్పత్రి అధికారులు.

పదిరోజులయిన తరువాత స్పృహవచ్చింది వెంకన్నకు ఆశగా అతని ముఖంలోకి చూచింది రోజా. తనని అతడు గుర్తుపట్టినట్లుగా తోచలేదు రోజాకు. వెంకన్న ఎక్కడో చూస్తున్నాడు. పిలిస్తే 'ఊ' అంటున్నాడు. ఆహారం తీసుకుంటున్నాడు. తనలో తను గొణుక్కుంటున్నాడు. మాట స్పష్టంగా వినపడటంలేదు. అంతర్ముఖుడైన ఋషివలె ఉన్నాడు. అతని కళ్ళు దేనినో వెతుకుతున్నాయి. రాజవ్వ వచ్చి రోజా పలకరించి వెళ్తున్నది. ఆమెను అతడు గుర్తు పట్టటంలేదు, రాములమ్మ ప్రొద్దునా సాయంత్రం రెండు పూటలా వస్తున్నది ఆసుపత్రికి. రాములమ్మవైపు చూచాడు. కాని ఆమెతో మాట్లాడలేదు. ఆమెను పలకరించలేదు.

మరునాడు వెంకన్న ప్రక్కన రోజా తప్ప మరెవ్వరూ లేరు. తనను గుర్తువట్టేలా చేయాలని రోజా ఆశ.

"ఏమండీ. మిమ్మల్నే" అని పిలిచింది రోజా వెంకన్నను.

"ఊ" అన్నాడు.

"నేను రోజాను"

"ఊఁ"

అతనిని తనవైపుకు తిప్పుకుంది రోజా.

ఒక్కసారి ఆమె కళ్ళలో కళ్ళు పెట్టి చూచాడు.

అంతే మళ్ళీ మగతలోకి పోయాడు.

రెండు రోజులయిన తరువాత వెంకన్న శారీరక పరిస్థితి కొంచెం మెరుగయింది. కాని చూపులు మునుపటి లాగానే ఉన్నాయి.

[illegible] రాజవ్వ వచ్చింది.

"రాజవ్వా" అని పిలవడానికి ప్రయత్నించినట్లు వెంకన్న పెదిమలు కదిలాయి.

రాములమ్మ వచ్చింది.

"తమ్ముడూ! నేను రాములమ్మను" అని పిలిచింది.

"ఊఁ" అన్నాడు వెంకన్న.

మళ్ళీ పిలిచింది.

"అక్కా" అన్నట్లు వెంకన్న పెదిమలు కదిలాయి.

మధ్యాహ్నం వెంకన్న, రోజాలు మాత్రమే ఉన్నారు.

"వెంకన్నా!" అని పిలిచింది రోజా.

కళ్ళు ఆమెవైపు తిప్పాడు వెంకన్న.

రోజా కళ్ళల్లో నంటన వనాలు వెలిశాయి.

"వెంకన్నా! నేను నీ రోజాను"

వెంకన్న రోజా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు మరోచేతితో ఆమె చేతిని కప్పాడు.

ఆమెవంక తదేక దీక్షగా చూచాడు.

బల్లమీద ఫ్లవర్ వాస్‌లో ఉన్న పూలగుత్తి వేపు చూచాడు. ఆ పూలగుత్తిని రోజా అతనికి అందించింది. పూలను విడదీశాడు. వాటిని తన దోసిట్లో పోసుకొని రోజా నెత్తిన చల్లాడు.

మళ్ళా మగతలోకి జారిపోయాడు.

దెబ్బతగిలిన నెలరోజులకు అతడు నడవగల్గాడు.

అతని నోట ఒకటేమాట వెలువడేది.

"ఈ దేశం నాదేనా?" అనేదే అది.

అతనికి మతిభ్రమణం కల్గిందన్నారు కలిగిన మారాజులు.

అడగాల్సిన ప్రశ్నే వేస్తున్నాడన్నారు బీదప్రజానీకం.

చనిపోయేనాటికీ అదేమాట వెంకన్ననోట.

# 20

బస్తీనుంచి వెంకన్న శవయాత్ర ప్రారంభమైంది. ముందు మైకుఉన్న సైకిలురిక్షా. దాని వెనుక వెంకన్నశవం. తర్వాత విషాదపూరిత వదనాలతో స్త్రీలు తరువాత పురుషులు.

ఊరేగింపు కదిలేప్పటికి రెండువందలజనం మాత్రమే ఉన్నారు. చౌరస్తా దగ్గరకు వచ్చేటప్పటికి రెండు వేలకు పెరిగారు.

మైకులోనుండి పాట వినిపడుతోంది.

"దేశం అంటే మట్టి కాదోయ్.

దేశం అంటే మనుషులోయ్.

దేశాభిమానం కలదని

వట్టిగొప్పలు చెప్పుకోకోయి.

పొరుగువాడికి గట్టిమేలు

తలపెట్టి చూపవోయి.''

గురజాడవారిగేయం ఆలాపిస్తున్నారు. పాట ఆగంగానే

''వెంకన్న అమర్ హై''

''వెంకన్నకు జోహర్లు''

అనే నినాదాలు వినపడ్తున్నాయి.

"ప్రతి మనిషికీ

తిండీ గుడ్డా కావాలి."

"ప్రతి మనిషికీ

చదువూ, మందూ మాకు కావాలి."

"ప్రతి మనిషికీ

తలదాచుకోటానికి ఇల్లు కావాలి.

ఇంతలో ఒక పదునాల్గేండ్ల బాలిక

"ఈ దేశం" అని అరిచింది

"మనదేనా?" మారుపల్కారు ఊరేగింపులో జనం.

కృష్ణారెడ్డికి గుర్తుకువచ్చింది వెంకన్న చనిపోకముందు ఇచ్చిన నినాదం.

కృష్ణారెడ్డీ, నారాయణరావు ఊరేగింపులో ఉన్నారు. రాములమ్మ, రాంప్యారీ, రోజా ఆడవాళ్ళమధ్య నినాదాలిస్తూ ఉన్నారు. శవవాహకుల్లో రంగడూ, సోమయ్యా కనుపించారు.

"రామ్ నామ్ సచ్ హై"

"రామ్ నామ్ సచ్ హై"

కేకలు మిన్ను ముట్టున్నాయి.

శ్మశానం ఇంకో ఫర్లాంగు ఉండవగా ఒక చౌరస్తా వచ్చింది. అప్పటికి ఊరేగింపులో జనం అయిదువేల వరకూ

జమ అయినారు. ఏ వందమందో తప్ప అందరూ శ్రామికులే. కాయకష్టం చేసి పొట్ట పోసుకునేవాళ్ళే.

వెంకన్న వాళ్ళమనిషి. వెంకన్న వాళ్ళ ప్రశ్న లేవ నెత్తాడు. అందుకే వాళ్ళంతా వచ్చారు. మైకుముందుకు ఒక యువకుడు చేరడు. గంభీరమైన అతని కంఠం పలికింది మైకులో [illegible]

"సోదర సోదరీ మణులారా! [illegible] మన వెంకన్న మరి ఇక లేడు."

"వెంకన్న అమర్ హై" [illegible]

[illegible] "వెంకన్న [illegible]" జనం నినాదాలిచ్చారు. [illegible]

యువకుడు మాట్లాడుతున్నాడు.

"వెంకన్న [illegible] లాంటి కార్మికుడు. అతడు చాలకాలం [illegible] బతికాడు. రాజవ్వ లేకపోతే ఎప్పుడో చనిపోయేవాడు"

"రాజవ్వ జిందాబాద్" అని కేకలు వేశారు యువతులు. మైకులో ఉపన్యాసం సాగింది.

"కుండీలలో చెత్త చెదారం ఏరేవాడు. పొట్ట నిండేది కాదు. జ్వరంవస్తే సూదిమందుకు నోచుకోలేదు. వంటిపోడా బట్ట అతనికి కరువయింది. మాసిన చిరిగినదుస్తులు అతని సొమ్ము. అతనిని చదువుకోనియలేదు సమాజం.

కాని అతడు సమాజాన్ని ద్వేషించలేదు. కష్టంచేసి బ్రతికాడు. జనానికి కిరసనాయిలు దొరక్కపోతే దొంగ వ్యాపారస్తుల గిడ్డంగులు అధికారులకు చూపించాడు. అతని వల్లనే మనకు కిరసనాయిలు కరువుపోయింది."

"జోహారు వెంకన్నకు" నినాదం ఇచ్చారుయువకులు.

"ఏం జరిగింది? అతనికి పనిపోయింది. అతడు నిరుద్యోగి అయ్యాడు.

అతడు ఏం తప్పు చేశాడు? 'ఈ దేశం నాదేనా' అని ప్రశ్నించాడు. తిండి, గుడ్డ, నీడా, చదువూ వైద్యం ఇవ్వలేని సమాజాన్ని గురించి ఈ ప్రశ్న అడిగితే మహా పాపమైందా?"

"కాదు! కాదు!" జనం కేకలుపెట్టారు.

శవదహనం జరిగింతరువాత అందరూ ఇళ్ళకువెళ్ళారు. అందరి మనస్సుల్లోనూ ఒకటేప్రశ్న "ఈ దేశం నాదేనా?"



# ఆలోచన

భారత దేశాన్ని గొప్ప ప్రజాస్వామ్య దేశంగా పేర్కొంటున్నారు. ఈ గొప్పతనం దేశం యొక్క విస్తీర్ణతలో, వైశాల్యంలో ఇమిడిఉంది. ఇచ్చట లాంఛన ప్రజాస్వామ్యం ఇంతవరకు పరిఢవిల్లుతున్నది. ప్రజలకు వోటు హక్కు, రాజులులేని రాజ్యం, శాసనసభలూ, పార్లమెంటూ, శాసనసభ విశ్వాసాన్ని పొందవలసిన ప్రభుత్వమూ, స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయ వ్యవస్థ దీని లక్షణాలు. ఇవి ప్రజలకు అనుభవంలోనికి రావడంలేదని తరుచుగా విమర్శ వినబడుతున్నది. 'కరిమ్రింగిన వెలగపండు' వలె ఈ వ్యవస్థలో ప్రజాస్వామ్యసారం లేదని వ్యాఖ్యానాలు వస్తున్నాయి. అసలు ఆ మాటకు వస్తే ప్రజాస్వామ్యం పై పూతగాకూడ లేదని మరికొందరిమాట. వీటిలో వాస్తవమెంత?

మనకు రాజకీయ ప్రజాస్వామ్యం ఉన్నది కాని ఆర్థిక ప్రజాస్వామ్యం లేదని విజ్ఞులు విశదీకరిస్తున్నారు. ఇది ఎంతవరకు నిజం?

ఈ నవల శీర్షిక "ఈ దేశం నాదేనా?" లో ఇన్ని ప్రశ్నలూ ఇమిడి ఉన్నాయి. నవలలో ముఖ్యపాత్ర అడిగే ప్రశ్నఅది. సమాధానాన్ని ఆశించే ప్రశ్నఅది. దేశ భవిష్యత్తు ఆ జవాబుపై చాలవరకు ఆధారపడుతుందని తెలుసుకోవలసిన తరుణం ఆసన్నమయింది. ఆ ఆలోచనను రేకెత్తించేదే మల్లాది సుబ్బమ్మ చే రచింపబడిన "ఈ దేశం నాదేనా?"

అనే ఈ నవల. ప్రశ్నకు సరిఅయిన సమాధానం చెప్పేముందు ప్రశ్నను అర్థం చేసుకోవాలి. దేశం అంటే ఏమిటి? "దేశం అంటే మట్టి కాదోయ్, మనుషులేనోయ్" అని గురజాడవారు ఎలుగెత్తి చాటారు. మరి ఇక్కడ ఆ అర్థం సరిపోతుందా? 'ఈ మనుష్యులు నావారేనా?' అని ప్రశ్నకు అన్వయం చేసుకోవడం తగునా? ఇక్కడ ఆ అర్థం పొసగదేమో. దేశం అంటే మట్టికాదు. నిజమే! అది భౌగోళిక రూపమా? ఆ సేతు హిమాచల పర్యంతం అని భాష్యం చెప్పుకున్నంతమాత్రాన చాలదేమో? అంటే దేశాన్ని ఏ ఒక్క పద్ధతిలో నిర్వచనం చేసుకున్నా పొరపాటు అవుతుంది. అది సమగ్ర స్వరూపాన్ని దర్శనం చేయదు. దేశం బహుముఖం. దానికి విభిన్నకోణాలు ఉన్నాయి. వైవిధ్యంతో విలసిల్లుతున్నది. దేశానికి భౌగోళిక అస్తిత్వం ఉన్నది. దేశప్రజల ఆచార వ్యవహారాలూ, సంస్కృతీ సంప్రదాయాలూ, ఆశలూ ఆశయాలూ. రాజ్యాంగ వ్యవస్థ, ఆర్థికపునాది, సామాజిక వ్యవస్థ ప్రజలకు కల్పించే వనరులూ సదుపాయాలూ నిధి నిక్షేపాలూ, సాంకేతిక ప్రగతి అన్నీ కలిస్తే దేశం అవుతుంది. ఇలా అవగాహన చేసుకున్నపుడు నవల శీర్షిక ప్రాధాన్యత గోచరిస్తుంది.

ఈ దేశంలోని ఆస్థి కొద్దిమంది చేతుల్లో ఉంటున్నదని అందరూ అంగీకరిస్తున్నారు. వ్యవసాయం ప్రధాన జీవనాధారంగా ఉన్న మనదేశంలో జనాభాలో 75 శాతం వ్యవసాయంతో ఏదో ఒకరకంగా సంబంధం ఉన్నవారు.

జనాభాలో 48 శాతం వ్యవసాయ కార్మికులు; అంటే భూమి లేనివారు. ఇక పరిశ్రమల విషయానికి వస్తే దేశ ఆర్థిక వ్యవస్థ ఇంచుమించుగా 300 కుటుంబాల పెత్తనం క్రింద ఉంటున్నదని శాస్త్రజ్ఞుల ప్రకటనలు తెలియజేస్తున్నాయి. దేశంలో అక్షరాస్యులు – అంటే అతికష్టంమీదనయినా సరే తమ దస్కతును పూర్తి చేయగలవారు – జనాభాలో 30 శాతం. ఇది స్వరాజ్యం వచ్చిన తరువాత 37 సంవత్సరాల తదుపరి సాధించిన ప్రగతి. జనాభాలో 48 శాతం దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్నారు. అంటే రెండు పూటలా తిండికి, కట్టుకోటానికి బట్టకు, కాపురముండటానికి తనదంటూ ఇంటికి నోచుకోనివారు జనాభాలో ఇంచుమించుగా సగంమంది అన్నమాట. బొంబాయి, కలకత్తా లాంటి మహానగరాలలో జనాభాలో 20 శాతం మంది ప్రజలు రోడ్లప్రక్కనున్న కాలి బాటలపై నివశిస్తున్నారు. అక్కడే పుట్టున్నారు. అక్కడే పెరుగుతున్నారు. అక్కడే చస్తున్నారు. దేశంలో 66 కోట్ల ప్రజలుంటే అందులో 6 కోట్లమంది మాత్రమే అంటే 10 వ శాతం క్రొద్దోగొప్పో సుఖశాంతులతో బ్రతుకుతున్నారు. ప్రజాభిప్రాయమంటే ఇంతవరకు వారి అభిప్రాయంగానే చలామణీ అవుతున్నది. పత్రికలు వారి శ్రేయస్సునే కాపాడుతున్నాయి. వారి ఆశలను, ఆకాంక్షలను ప్రతిబింబిస్తున్నాయి.

దేశంలో ఉన్న 5 లక్షల గ్రామాలలో ఇప్పటికీ లక్షపైచిలుకు గ్రామాలకు మంచినీటి సదుపాయం లేదు. గ్రామాలలో పాఠశాలలు ఉండవు. ఉంటే ఉపాధ్యాయుని నియమించదు ప్రభుత్వం. అలా జరిగినా అతగాడు ప్రతిరోజూ పాఠశాలకు రాడు. వచ్చినా పాఠం చెప్పడు. గ్రామాలలో ఆసుపత్రుల విషయం అంతంత మాత్రంగానే ఉంటున్నది. ఆస్పత్రులుంటే మందులు ఉండవు. మందులు సమృద్ధిగా ఉన్న ఆసుపత్రులలో వైద్యులు ఉండరు. ఈ రెండు లక్షణాలు ఉంటే అవి గ్రామపెద్దలకూ, ధనవంతులకు మాత్రమే అందుతాయి. పట్టణాలలో పరిస్థితి కొంత మెరుగు. కాని బీదలకు గుడిశెలు వేసుకోవడానికి కూడా చోటు ఉండదు. నీటి కుళాయిలు ఉండవు. ప్రక్కన ఉన్న ఇంటి ఆసామికి పైసలు ఇచ్చి నీళ్ళను కొనుక్కుంటారువాళ్ళు. జబ్బుచేసి ఆసుపత్రికివెళ్తే వీరికి ఆలనా పాలనా ఉండదు. రోగులకు ఇవ్వవలసిన పాలు, రొట్టె వగైరాలు వీరిదాకా రావు. మందుల సంగతి సరేసరి. నీళ్ళమందులు మాత్రం సీసాలలో పోస్తారు - లేకపోతే గోలీలు కొన్ని ముఖాన పారవేస్తారు. కాకపోతే నోరున్నవారు, బలగం ఉన్నవారు అదిరించి బెదిరించి కొంతగా కొంత వెసులుబాటును పొందుతున్నారు.

రాజకీయం ప్రజలకు దూరంగా, ప్రజాశ్రేయస్సుకు సంబంధం లేకుండా సాగుతున్నది. ప్రతి ప్రజోజనుడికి

వోటున్నది. కానివోటును వినియోగించుకోటానికి అవసరమైన ప్రతిపత్తి మాత్రం శూన్యం. ధైర్యంగా, నిబ్బరంగా వోటు హక్కును వినియోగించుకోవాలని ఏ వ్యక్తి అయినా ప్రయత్నించి పోలింగుకేంద్రానికి పోయేటప్పటికి అతని వోటు పోలయిఉంటుంది. వోట్లను మూకవుమ్మడిగాను, విడివిడిగాను కొనుగోలు చేయటం పరిపాటి అయింది. ఈ అక్రమాలు సాగించడానికి చాలమంది రాజకీయనాయకులు, చాల రాజకీయ పార్టీలు వెనుదీయటంలేదు. ఒకనాడు అలాంటి పని చేయటానికి రాజకీయ కార్యకర్తలు సిగ్గుపడేవారు. ఇపుడు పరిస్థితి మారింది. వారినిచూచి, దేశపరిస్థితినిచూచి చైతన్యవంతులైన ప్రజలు సిగ్గుపడవలసిన దుర్గతి కలిగింది. చచ్చిచెడి ప్రజలు తమ పార్టీని గెలిపించుకుంటే ఆ పార్టీ ప్రభుత్వాన్ని చేపట్టేదాకా అనుమానం; తరువాత నిలకడగా సాగించగలగడం అంతకన్న సందేహాస్పదం. కేంద్రంలోని రాజకీయపార్టీకి వ్యతిరేకంగా ఉన్న రాజకీయపార్టీలు అధికారంలో ఉన్న రాష్ట్రాలలో ప్రభుత్వాలు చివరవరకు కొనసాగుతాయనే నమ్మకంలేదు. ఏదో కుంటిసాకుతో వాటిని రద్దుచేస్తుంది కేంద్రంలో పెత్తనం సాగించే రాజకీయపార్టీ. రాజకీయపార్టీలు చాలవరకు ప్రజావిశ్వాసాన్ని కోల్పోయినాయి స్వేచ్ఛను కాపాడటానికి మిగిలింది సుప్రీంకోర్టు మాత్రం. అయితే అది సామాన్యప్రజలకు అందబాటులో లేకుండా

ఉన్నది. కోర్టు ఖర్చులను సామాన్యప్రజలు భరించలేనిస్థితి వచ్చింది. దాంతో వారికి న్యాయం దూరమయింది. ఎన్నికల వ్యవస్థ సక్రమంగా పని చేసినా, ఎన్నుకున్న తర్వాత 5 సంవత్సరాలకు ప్రజాప్రతినిధులపై ప్రజలకు కంట్రోలు, అజమాయిషీలు లేవు.



పైన వివరింపబడిన సామాజిక వ్యవస్థలో నీతిపంతుడైనపౌరుడు, నిజాయితీని, చిత్తశుద్ధిని కోల్పోనివ్యక్తి ఈ దేశంలో తన స్థానాన్ని గురించి ప్రశ్నించటం తప్పేమీ కాదు.



ఈ దేశం నాది అనుకోవాలంటే ఈ దేశ సంపదలో నాకు భాగస్వామ్యం ఉండాలి. భూమో, స్థలమో, పరిశ్రమో, నిధియో, నిక్షేపమో, వ్యాపారమో, కనీసం భద్రత ఉన్న ఉద్యోగమో ఉండాలి. లేకపోతే సమాజం ఒనగూర్చే విద్యా, వైద్య, గృహ, విహారవసతులు నాకు అందుబాటులో ఉండాలి. ఏవీలేనప్పుడు, నేను వేసే వోటుద్వారా ప్రభుత్వాన్ని కంట్రోలు చేయలేనపుడు, మళ్ళీ 5 సంవత్సరాలవరకు నేను అప్రయోజకుడిగా జీవితం సాగించాల్సివచ్చినపుడు ఈ దేశం నాదని నేను ఎలా చెప్పుకోగలను? ఈ పరిస్థితి మారేవరకూ ఈ ప్రశ్నను ఎవరో ఒకరు వేస్తూనే ఉంటారు. జవాబు చెప్పలేని స్థితిలో దేశనాయకులు ఉండక తప్పదు.

ఎం. వి. రామమూర్తి.

# రచయిత ఇతర గ్రంధాలు

| | రు_పై |
|---|---|
| ఓ మహిళా! ముందుకు సాగిపో | 7-00 |
| మారుతున్న సమాజం-మహిళలు | 5-00 |
| మహిళాదశాబ్దం | 7-50 |
| స్త్రీ విమోచన | 7-50 |
| మహిళాభ్యుదయం | 15-00 |
| భావ వాహిని | 5-50 |
| మనం దేనికి భానిసలం? | 3-50 |
| తల్లే పిల్లను చంపితే? | 3-50 |
| విముక్తి ఉద్యమాలు: మహనీయులు | 3-50 |
| ఆధునిక స్త్రీ | 12-00 |
| ఆంధ్రప్రదేశ్ లో హేతువాద ఉద్యమ చరిత్ర | 2-00 |
| ఇస్లాం: స్త్రీలు | 15-00 |
| కాంతి కిరణాలు | 12-00 |
| వెలిగిన జ్యోతి | 12-00 |
| చీకటి వెలుగులు | 10-00 |
| ప్రేమ+సెక్స్ = నీతి | 17-00 |
| "ఈ దేశం నాదేనా?" | 5-00 |
| వివాహం: నేడు, రేపు | 20-00 |
| మాతృత్వానికి మరోముడి | 20-00 |
| సామ్రాజ్ఞి రుద్రమదేవి (బాలల నవల) | |
| క్రైస్తవం: స్త్రీలు (విమర్శనాత్మక గ్రంధం) | |
| హిందూమతం: స్త్రీలు (పరిశీలనాత్మక గ్రంధం) | |
| ఆం. ప్ర. లో మహిళోద్యమం: మహిళా సంఘాలు | |

Women, Tradition & Culture

Women' s Movement & Associations in A. P.

Women in Revolt Saga of Struggle